*Issued*—16-4-1955




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## FRIDAY, 14th MAY 1954

**VOLUME VII — No. 5**

*CONTENTS*



PRINTED BY SREE PANDURANGA PRESS, ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL
1955

PRICE, 6 annas

# ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Friday, the 14th May 1954**

The House met in the T. L N Sabha Hall, University Campus, Waltair, at nine of the clock, Deputy Speaker (Sri P. Suryachandra Rao) in the Chair.

## QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS

*Engineering College at Anantapur.*

*485 Q-Sri N. SIVARAMI REDDI (on behalf of Sri T. NAGI REDDI) Will the Hon. the Minister for Education and Industries be pleased to state

(a) the number of students in the Engineering College at Anantapur,

(b) whether any arrangements are made to hold examinations at Anantapur itself, and

(c) the number of students that appeared for examinations in the year 1952-53?

The Hon Sri S. B. P. PATTABHIRAMA RAO —

(a) 315

(b) Arrangements have been made to hold the ensuing examination (both written and practical) at Anantapur itself. Steps are also being taken to hold the examinations at Anantapur itself hereafter. I hope that by this time they have been held.

(c)

| MARCH | | SEPTEMBER | |
|---|---|---|---|
| I B.E. | 83 | I B.E. | 23 |
| II B.E. | 73 | II B.E. | 37 |
| III B.E. | 83 | III B.E. | 39 |
| Final B.E. | 73 | IV B.E. | 31 |
| | 312 | | 130 |

(a) 315. (b) ఇదివరలోనే అనంతపురం engineering college లో పరీక్షలు జరపవలయునని ప్రభుత్వానికి ఒక అభిప్రాయం ఉంది. ఈ జవాబు మార్చి నెలకు ముందుది కాబట్టి పరీక్షలు అచ్చట జరుగుతాయని ఉంది. ఈ పాటికి పరీక్షలు అయిపోయి వుంటాయి. అనంతపురం కాలేజీలోనే పరీక్షలు జరిగాయనుకుంటాను. అక్కడ పరీక్షలు జరిగినదీ లేనిదీ అనంతపురం M. L. A. లు ఎవరైనా ఉంటే తెలియజేయండి.

An hon. MEMBER — జరిగాయి.

The Hon. Sri S B. P. PATTABHIRAMA RAO — (c) జవాబు మార్చిలో 312 మంది, సెప్టెంబరులో 130 మంది.

Sri N. SIVARAMI REDDI — 315 మంది విద్యార్థులలో ఏఏ జిల్లాలనుండి ఎంతెంతమంది వచ్చారు ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — ఈ ప్రశ్నకు జవాబు చెప్పడానికి ఇక్కడ information లేదు. దీన్ని గురించి మీరు ప్రత్యేక ప్రశ్న వేస్తే information తెప్పించి జవాబు చెప్పగలను. ఏఏ జిల్లాలనుంచి ఎంతమంది విద్యార్థులు వచ్చారో ? వారు ఏఏ శాఖలలో చదువుతున్నారో అని అడిగితే దానికి జవాబు ఇప్పుడు చెప్పడానికి అవకాశం వుండదు.

Sri T. LAKSHMINARAYANA REDDI—ఈ Engineering College ని అనంతపురంనుండి తిరుపతికి మార్చాలని ప్రభుత్వమునకు ఏమైనా proposal ఉందా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— ఈ అనంతపురం Engineering college ని తిరుపతి తీసుకు రావచ్చునని చెప్పి తిరుపతి విశ్వవిద్యాలయానికై ఏర్పాటు చేయబడిన కమిటీ రిపోర్టులో వున్నది. దీనిని ఆ కమిటీ సూచించింది. కాని అలాగ ఆ కాలేజీని తిరుపతికి మార్చవలయునని నాకు ఏ మాత్రం ఉద్దేశ్యం లేదు. అనంతపురంలోని ఈ కాలేజీని మాత్రం ఎక్కడికీ తీసుకు వెళ్ళం. అది అనంతపురంలోనే

వుంటుందని మనవి చేస్తున్నాను. కాకినాడలో Engineering College ఉన్నది. విశ్వవిద్యాలయం మాత్రం విశాఖపట్టణంలో ఉన్నది. అలాగ ఉన్నా కార్యక్రమం సరిగానే సాగిపోతున్నది. అందువల్ల ఇది అనంతపురంలోనే ఉంటుంది. దానిని తిరుపతికి మార్చే ఉద్దేశం ప్రభుత్వానికి లేదు.

Sri S. NARAYANAPPA — అనంతపురం ఇంజనీరింగు కళాశాల ప్రిన్సిపాల్ గారు Tamilian అవడంవల్ల అక్కడ ఉన్న ఆంధ్ర students కు ఆయనకు మనస్పర్థలేవో ఉన్నాయని, అవి పెరిగిపోయి చాలా ప్రబలమై పోతున్నాయని ప్రభుత్వమునకు తెలుసునా? తెలిసి యుంటే అక్కడినుంచి సదరు ప్రిన్సిపాల్ ను ట్రాన్స్ఫర్ చేయడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తారా?

The Hon Sri S. B. P. PATTABHIRAMA RAO — ఈ విషయం మీరు చెప్పేవరకు తెలియదు. ఈ విషయం గవర్నమెంటు దృష్టిలోకి వచ్చిన తరువాత తగుచర్య తీసుకుంటారు.

Sri C. V. K. RAO — అక్కడ ఉన్న 215 మంది విద్యార్థులకు hostel సదుపాయాలు సరిగా ఉన్నాయాండి!

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — విద్యార్థులకు postal సౌకర్యాలు telegraph సౌకర్యములు సరిగానే ఉన్నాయి అనుకుంటాను.

Sri C. V. K. RAO — అధ్యక్షా! నేను అడిగిన ప్రశ్నకు సరిగా సమాధానం రాలేదు. Hostel సదుపాయాలంటే postal సదుపాయాలని తప్పుగావిని గౌరవనీయ మంత్రిగారు జవాబిచ్చారు. నేను హాస్టల్ సదుపాయాలను గురించి అడిగాను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— మీరు చెప్పింది postal అన్నట్లుగా వినబడింది. అది మీ లోపమో నా లోపమో. అక్కడ వారందరికి హాస్టల్ సదుపాయా లున్నాయనే నా అభిప్రాయం.

Sri S. VEMIAH —May I know how many scheduled caste candidates there are out of these 315 and out of the 312 and 130 respectively ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — I have no figures here.

*Committee to examine the Eelementary Education Policy*

* 491 Q—Sri P. RANGA REDDI Will the Hon. the Minster for Education and Industries be pleased to state .

(a) whether any Committee has been appointed by the Government to examine the Elementary Education Policy ?

(b) the purpose and scope of this Committee, and

(c) the terms of reference to this Committee ?

The Hon. Sri S B. P. PATTABHIRAMA RAO—

(a) The answer is in the affirmative.

(b) & (c) They are

(1) The Committee will go into the whole question of Elementary Education in the Andhra State and for this purpose they will examine

(a) the system of Elementary Education as it prevailed upto the end of academic year 1952—53;

(b) the system known as the modified scheme of Elementary Education introduced at the beginning of the academic year 1953—54; and

(2) recommend the manner in which the quality of Elementary Education could be improved and modelled and spread amongst a larger number of pupils without unduly increasing the cost of education to the State,

(a) : అవును.

(b) & (c) · Elementary Education Committee ప్రాథమిక విద్యకు సంబంధించిన ప్రశ్న అంతా కూడా ఆలోచన చేస్తుంది. అందులో 1952-53 academic year చివరవరకు ఏ విధంగా వున్నదో పరీక్ష చేయడం 1953 - 54 ప్రథమంలో ప్రవేశ పెట్టబడిన modified elementary education విధానం ఏ విధంగా పనిచేస్తుంది అని పరీక్ష చేసి మన రాష్ట్రానికి యే విధమైన ప్రాథమిక విద్య మంచిదో, ఏ విధమైన ప్రాథమిక విద్య అవసరమో, యే విధమైన ప్రాథమిక విద్య వుంటే ఎక్కువమంది విద్యార్థులకు చదువు చెప్పడానికి మన రాష్ట్రంలో వీలవుతుందో, మన రాష్ట్రం ఎక్కువ ఖర్చుపెట్టలేని స్థితిలో వుందికనుక వున్న దాంట్లో జాగ్రత్తగా ఖర్చుపెట్టాలి కనుక ఏ విధమైన స్కీము వల్ల డబ్బు ఖర్చు తగ్గుతుందో మొదలైన విషయాలు సమగ్రంగా విచారించి ఒక సూచన చేయవలసినదిగా కోరబడింది.

Sri P. RANGA REDDI — కమిటీ రిపోర్టు 10వ తారీఖున వస్తుందని యిదివరలో అన్నారు. ఇంకా రాలేదు. ఈ సమావేశంలోగా కమిటీ రిపోర్టు తెప్పించి చర్చించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon. Sri S. B. P PATTABHIRAMA RAO — కమిటీవారు 10వ తేదీలోగా రిపోర్టు పంపాలని కోరబడ్డారు. వారు కొంచెం కాలవ్యవధి కావాలని కోరారు. అది యీ నెల 28వ తారీఖుకు వస్తుంది అని తెలుస్తుంది. 28వ తారీఖుకు రిపోర్టు వచ్చినట్లయితే దానిని పరిశీలించి వచ్చే సంవత్సరానికి ఆచరణలో పెట్టాలని ప్రభుత్వం ప్రయత్నం చేస్తుంది.

Sri G. LATCHANNA :—ఈ కమిటీ రిపోర్టు శాసన సభ పరిశీలించే అవకాశం వుంటుందా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— ఆ కమిటీలో శాసనసభలోని అన్ని పార్టీల సభ్యులు వున్నారు. వారు పరిశీలించి యీ నూతన విద్యావిధానం పనికిరాదని ఏక గ్రీవమైన నిర్ణయంకు వస్తే వేరే శాసనసభలో చర్చించనవసరం లేదని మనవి చేస్తున్నాను. వారి రిపోర్టును department

పరీక్ష చేసి పంపడానికి కొంత కాలం పడుతుంది. ఈ స్కీము పనికి రాదని నిర్ణయిస్తే వచ్చే సంవత్సరంకూడా పనికిరాదని నూతన విధానం వుంచడంవల్ల ప్రయోజనం వుండదు. ఇట్లా practical difficulties వున్నవి. ప్రభుత్వం ఆలోచించి ఏది అనుకూలముగా వుందనితోస్తే ఆ విధంగా చేస్తుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU — ఈ రిపోర్టు అనుకూలంగా వున్నంతవరకు అమలుపరుస్తామని మంత్రిగారు సమాధానంయిచ్చారు. అనుకూలం అంటే అందరికీ అనుకూలంగా వుండాలా లేక మంత్రివర్గపు విధానాలకు అనుకూలంగా వుండలా లేక ఎవరికి అనుకూలంగా వుండాలి? మంత్రిగారు యిదివరలో పత్రికా ముఖంగా expenditure ఎక్కువ కాకుండా వున్నట్లయితే అమలు పరుస్తాం అని చెప్పారు. నూతన విద్యావిధానం అమలు పరచడంవల్ల కొంత మంది వుపాధ్యాయులను తగ్గించవచ్చు. అందుచేత ఖర్చు తగ్గినదని నూతన విద్యావిదానాన్ని తిరిగి అమలు పరుస్తారా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — ఎవరికి అనుకూలం అన్న ప్రశ్నకు జవాబు 'ఆంధ్రరాష్ట్రానికి' అనుకూలం. అందులో ప్రభుత్వంకూడా వున్నది. ప్రజలుకూడా వున్నారని నానమ్మకం. అయితే అది ఏ విధంగా అనుకూలం అని అడిగారు. కమిటీ వారిచ్చిన నివేదికవల్ల రాష్ట్రానికి విపరీతమైన ఖర్చు కనబడితే అది అమలు పరచడం సాధ్యం కాదు కదా. హెచ్చుఖర్చుకాని స్కీము వారు చెప్పినట్లయితే వెంటనే ఆ స్కీము అమలు పరచడానికి అభ్యంతరం లేదు.

Sri D. DASARATHARAMAIAH NAIDU — ఈ నూతన ప్రాథమిక విద్యావిధానం గురించి మనం మద్రాసు రాష్ట్రంలో వుండగా చర్చించాము. మద్రాసులో అమలు పరచడం కూడా జరిగింది. ప్రస్తుతం మద్రాసులో దీనిని సఫలం కానందున తీసివేశారని పత్రికల్లో పడింది. దాని దృష్ట్యా యింక దీనిని పరిశీలించ కుండానే ఈ విద్యావిధానాన్ని ఆపు చేయడానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— వారి ప్రశ్నలో అంతా యదార్థం వున్నదని అనుకోను. ఎందు

కంటే మద్రాసులో అమలు జరగడం లేదని తెలియలేదు. విడిపోయిన తరువాత మద్రాసు రాష్ట్రంతో సంబంధం పెట్టుకోడం నాకు యిష్టంలేదు కమిటీ వేశాము ఒక నిర్ణయము వస్తుంది. ఈ లోగా open-mind తో వుండడం మంచిదని భావిస్తాను.

Sri T. NAGI REDDI — నూతన విద్యా విధానం అమలు పరచిన తరువాత ప్రభుత్వం కొంతమంది వుపాధ్యాయులను తగ్గించడం ద్వారా ఖర్చు తగ్గించి వుండవచ్చు. విపరీతమైన ఖర్చులు లేకుండా అంటూ చెప్పిన దానికి అర్థం వివరిస్తారా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — నూతన విద్యా విధానం వలన ఉపాధ్యాయులను తగ్గించారని నాకు తెలియదు. నూతన విద్యావిధానం వలననే వుపాధ్యాయులను తగ్గించినట్టు నాకు భోగట్టా రాలేదు. ఖర్చు విషయంలో విపరీతం అంటే disproportionate గా లేనట్టయితే budget balance చెడకుండా చూసుకోవచ్చు. కొద్ది లక్షలయితే పరవాలేదు. కాని 50 లక్షల (యిది సుమారుగా చెబుతున్నాను) రూపాయల ఖర్చుకు పైగా అయితే కష్టమని నా అభిప్రాయము.

Sri N. SIVARAMI REDDI :- మద్రాసు శాసనసభలో యీ నూతన విద్యావిధానంపై చర్చవచ్చినప్పుడు ఆంధ్ర శాసన సభ్యులలో ఎక్కువమంది దానికి వ్యతిరేకంగా వోటుచేశారు. దానిని దృష్టిలో పెట్టుకుని, యీనాటి వుపాధ్యాయుల, విద్యావేత్తల అభిప్రాయాలు దృష్టిలో పెట్టుకుని యీ నూతన విద్యా విధానమును చర్చించాలి. మంత్రిగారు ఏమి చెబుతారు ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— ముందే మనవి చేశాను. 10 వ తారీఖులోపున రిపోర్టు పంపించమని కోరబడింది. కాని యీకాలం సరిపోదన్నారు. కమిటీవద్దనుండి రిపోర్టు వచ్చిన తరువాత డిపార్టుమెంటుకు పోతుంది. అక్కడ దీనిని పరీక్షచేయడానికి 10, 15 రోజులు పడుతుంది. మొత్తానికి 28 వ తారీఖుకు యీ రిపోర్టు వస్తుంది. ఈ నూతన విద్యావిధానం అక్కరలేదంటే discussion చేయవలసిన అవసరమే వుండదు.

వ్యవధిలేని కారణంచేత జూనులో మరొక సమావేశంలో దానిని చించవచ్చునని మనవి చేస్తున్నాను.

Sri T. NAGI REDDI :— 'నూతన విద్యావిధానం అమలు జరుపవలసివస్తే మనం ఎసెంబ్లీలో discuss చేయవలసిన అవసరం ఏర్పడవచ్చును' అని మంత్రిగారన్నారు. దీనిని బట్టి నూతన విద్యావిధానం రానున్న సంవత్సరం అమలు జరుపబడదని, ఆ విధంగా అమలు జరుపుటకు ముందు చర్చకు అవకాశం ఇస్తారని మేమనుకో వచ్చునా ?

The Hon Sri S. B. P. PATTABHIRAMA RAO.— నేను ఉన్న పరిస్థితులు మనవి చేశాను. సమాధానం చెప్పినప్పుడు ప్రతి అక్షరం శల్యపరీక్ష చేసి అర్థాలు తీస్తూంటే మనవి చేయలేను. ఇప్పుడున్న పరిశీలనా సంఘం విద్యావేత్తలతో, అన్ని పక్షాలకు సంబంధించినటువంటి పెద్దలతో కూడిన సంఘం కనుక వారు ఏదో పద్ధతిలో unanimous opinion కు వస్తారని ఆశిస్తున్నాము. అట్లా కాకుండా ఒక విరుద్ధ పద్ధతిలో అభిప్రాయమిస్తే కష్టసాధ్యమవుతుంది. Discuss చేయవలసిన అవసరం ఉంటే discuss చేయవలసి వస్తుంది.

*Retrenchment of 9 (a) (i) candidates in Andhra State.*

* 501 Q—Sri K. KRISHNA RAO —Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the nubmer of 9 (a) (i) candidates in Government service in the districts of Andhra State prior to 1-10-53, whose services were terminated, or to whom notices terminating service were given on or after 1-10-53 as a measusre of retrenchment ? and

(b) the number of peons and attenders in Government service in the area and jurisdiction of the Andhra State prior to its formation, whose services were terminated on or after 1-10-53 as a measure of retrenchment ?

The Hon. Sri T. PRAKASAM:—

(a) 187

(b) Attenders - Nil
Peons - 208

(a) 187. (b) Attenders ఎవ్వరూ లేరు. peons 208 మంది.

Sri K. KRISHNA RAO — నోటీసు ఇవ్వబడినవారిని తిరిగి entertain చేసుకుండా విధులలోకి తరిమి వేశారా ?

The Hon Sri T. PRAKASAM — అలాంటి ప్రశ్న వేస్తే కొంచెం notice ఇస్తే గాని మీకు జవాబు ఎట్లా వస్తుందో చెప్పండి ? పరీక్షచేసుకవలసి యుంది, జవాబు చెప్పవలసియుంది.

Sri K. KRISHNA RAO—మదరాసు రాష్ట్రంలో గాని, మన రాష్ట్రంలో గాని, technical గా 9 (a) (1) వారికి నోటీసుఇచ్చి మరల 1, 2 తేదీలలో entertain చేయడం జరుగుతోంది. అవసరంలేని peons ను తీసివేయడం జరుగుతోంది వారిని తిరిగి enlist చేస్తారా ?

The Hon. Sri T. PRAKASAM—జరిగిందని మీరు చెబుతున్నారు. జరిగిందా లేదా అనే సంగతి మేము కనుక్కోవాలి కదా. కనుక్కున్న తరువాత జవాబు చెప్పాలి.

*Conversion of diesel oil run stations into coal using thermal stations.*

* 502 Q—Sri K. KRISHNA RAO—Will the Hon. the Deputy Chief Minister be pleased to state·

(a) whether it is a fact that in the case of industrial consumers served by Government Thermal Stations run by diesel oil engines, the rate charged is Rs. 0-1-6 per unit, while fuel surcharge levied on such consumers is Rs. 0-2-3 per unit, and what are the corresponding rates under regular rate and fuel surcharge in the case of consumers served by Thermal Stations run by coal;

(b) the stations in the Andhra Power System and Rayalaseema Power System that are run by coal and

by diesel oil respectively and whether all consumers under diesel oil run thermal stations are charged rates in (a), and

(c) the steps taken to convert diesel oil run stations into coal using thermal stations ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) In Government Thermal Stations run by diesel oil, the industrial consumers are not charged at a uniform rate of 1½ annas per unit but are charged rates varying from 1.5 annas to 2 annas. The fuel surcharge levied on these industrial consumers is nowhere 2¼ annas per unit but it varies from 1.23 annas to 1.71 annas per unit. The corresponding rates for the consumers served by the thermal stations run by coal are :—

| | *Rate per unit* | *Fuel surcharge per unit* |
|---|---|---|
| Visakhapatnam | 1.5 annas (for the 1st step) | 0.405 annas. |
| Vijayawada | 1.5 annas (for the 1st step) | 0.585 annas. |

(b) COAL STATIONS

| *Andhra Power System* | *Rayalaseema Power System* |
|---|---|
| 1. Visakhapatnam | Nil. |
| 2. Vijayawada | |

DIESEL STATIONS

| | |
|---|---|
| 1. Kakinada | 1. Anantapur |
| 2. Ongole | 2. Tadpatri |
| 3. Srikakulam | 3. Nandyal |
| | 4. Proddutur |
| | 5. Madanapalli |
| | 6. Cuddapah |
| | 7. Kurnool |

As regards the rates charged for industrial consumers attention is invited to the answer to clause (a).

(c) Diesel oil generating stations are provided in small schemes for areas far off from large hydro or coal thermal power stations and are abolished when hydro or coal thermal power is extended to those areas. The existing diesel stations in the Rayalaseema Power System will be abolished when hydro power is available from the Tungabhadra hydro station and those in the Andhra Power System will be abolished when hydro power is available from the Machkund hydro station.

Sri K. KRISHNA RAO —ఇప్పుడు అంతా గవర్నమెంటు మేనేజి చేస్తోంది కాబట్టి పూర్తి అయిన station లలో నైనా దాని ఖర్చులుబట్టి rates వేయకుండా, thermal power కానివ్వండి, hydro electric power కానివ్వండి uniform గా rates ఎందుకు పెట్టలేదు.

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఈ point చీఫ్ ఇంజనీరుగారితో discuss చేశాను. ఒక ఊరిలో తక్కువ ఒక ఊరిలో ఎక్కువ వుంటే బాగా లేదని నాకుకూడా తెలుసును. Province wide గా ఒకటే scale పెట్టుటకు చర్చించాం. ఈనాడు Engineer గారు వస్తున్నారు. ఇంకా చర్చలు సాగించి కొద్దిరోజులలో ఒక నిర్ణయానికి వస్తాము.

Sri D. DASARATHARAMIAH NAIDU :— నెల్లూరు power station coal తో run చేయబడుతోందా, oil తోనా ? అక్కడ unit surcharge ఎంతో తెలియపరుస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI —I need a separate question for I do not have the details here.

*Assignment of land to Harijans of Markandiputti of Srikakulam District*

*503 Q —Sri P. GUNNAYYA:—Will the Hon. the Minister for Land Revenue be pleased to state :

(a) whether the Estate Manager of Bobbili surveyed a land of 50 acres for being given to the Harijans of Markandaputti of Srikakulam District,

(b) whether they have not yet been authorised to cultivate the above said land, and

(c) if so, the reasons for the same?

The Hon. Sri K. KOTI REDDI —

(a) An extent of 50 acres and more of banjar land in Markandaputti Village, Parvathipur Taluk, Srikakulam District is available and proposed to be assigned to the Harijans of that village. The said extent has not been got surveyed.

(b) There is no information but it has been reported that the Harijans do not appear to be cultivating the lands pending assignment in their favour.

(c) proposals for assignment are made. Possession of the lands will be given to the assignees soon after the assignments are finalised.

శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం తాలూకా మార్కండపుట్టిలో 50 ఎకరాలు హరిజనులకు assign చేయవలెనని వున్నది. ఈ assignment కు ముందుగానే హరిజనులు ఆ భూములలో ప్రవేశించి సేద్యం చేసుకొనుట లేదని చెప్పి తెలిసింది. Assignment proposals జరుగుచున్నవి. Assignment complete చేస్తాము.

Sri P. PUNDARIKAKSHACHARYULU.—ఈ సర్వే చేసిన 50 ఎకరముల భూమి, జిరాయితి భూములా, grazing భూములా, లేక గవర్నమెంటు పోరంబోకులా? వాటికి ఎవరెవరు apply చేశారు?

The Hon. Sri K. KOTI REDDI.. ఇంతకుముందు జమీందారిలో ఉండేటప్పుడు పశువులను మేపుటకు 160 ఎకరములు lease చేశారు. ఎకరం ఒకటింటికి 1½ రూపాయల ప్రకారం ఇచ్చారు. దానిని సాగుకిస్తే

ఎకరానికి $2\frac{1}{2}$ రూపాయలు ఇస్తామని చెప్పారు. గేంగుకు $1\frac{1}{2}$ రూపాయ వసూలు చేస్తూ వచ్చారు తరువాత grazing పేరిట $1\frac{1}{2}$ ఇస్తూ, సాగుకూడా చేసినట్లు information వచ్చింది. హరిజనులు రైతులు అందరు apply చేశారు Grazing కు 50 ఎకరములు వుంది, మిగిలిన దానిలో 60 ఎకరములు బీదలకు assignment చేయుటకు ఏర్పాటు జరుగుతున్నవి.

Sri M. VEERABHADRAM — పిటిషన్ పెట్టి ఎన్నాళ్ళు అయింది ?

The Hon. Sri K. KOTI REDDI — దరఖాస్తు పెట్టడం composite province లో జరిగింది. దానిని ఇప్పుడు సర్వే చేయిస్తున్నాము ?

Sri G. RAMA RAO — ఈ assignment proposals లో ఈ భూములకు మార్కెటు వాల్యూ వసూలు చేయవద్దని చెప్పినారా ? వసూలు చేస్తున్నారా ?

The Hon. Sri K KOTI REDDI — ఈ భూమి grazing కు ఉండుటవల్ల దానికి మార్కెటు వాల్యూ లేదు. అవసరంవస్తే కనుక్కొంటాను.

Sri G. RAMA RAO — మంత్రిగారు ఇచ్చిన సమాధానం అసందర్భంగావుంది. Point కు జవాబు కాదు. మార్కెటు ధరయెందుకు వసూలు చేయాలని, యెందుకు కలక్టరకు ఆ విధంగా ఆర్డర్లు పంపలేదని అడుగుతున్నాను ?

(No reply)

Sri G. LATCHANNA :— ఈ సందర్భంలో హరిజనులకు రైతులకు పరస్పర ద్వేషాలు ఉన్నాయని ప్రభుత్వానికి తెలుసునా ? దానిని సర్దుబాటు చేయుటకు ఏమైనా ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri K. KOTI REDDI — రైతులను పిలిపించి సమాధానం చేశాము. రైతుల సమ్మతం మీదనే ఇచ్చారని తెలుస్తున్నది.

Sri G. RAMA RAO — లోగడ బంజర్ల పంపకంనుగూర్చి అసెంబ్లీ తీర్మానం పాసు చేసింది. అందరూ యేక గ్రీవముగా ఒప్పు కొన్నారు. మార్కెట్టు ధర లేకుండా మంజూరు చేయాలి. దీనిని యింప్లి మెంటు చేయడానికి ప్రభుత్వం కలెక్టరులకు తాకీదు పంపిందా? పంపక పోతే, యెందుకు పంపలేదు? అసలు యీ విషయములో మీ వుద్దేశ్య మేమిటి?

The Hon. Sri K. KOTI REDDI — అసెంబ్లీ పాసుచేసిన తీర్మానాలకు legal effect లేదు. Proposals చేసే విష యమై cabinet decide చేస్తారు

An Act must be enforced. But so far as the resolution is concerned, it is only a recommendation.

Sri R. SIDDANNA GOWD — I have not been able to catch the eye of the Deputy Speaker.

Sri C. V. K. RAO:— నేను ఒక point of order తెస్తు న్నాను. శాసనసభలో పాసుచేసిన తీర్మానానికి ఎటువంటి పరపతి లేదని మంత్రిగారు చెప్తూ ఉన్నారు. దానిని ప్రభుత్వం అమలు పెట్టవలసిన అవసరం లేదని, ఇష్టం ఉంటే అమలు పెట్టవచ్చు అన్న ధోరణిలో చెప్పారు అవి recommendatory అనికూడా చెప్పారు. దీనిపై అధ్యక్షులవారు ఒక రూలింగు ఇవ్వవలెనని కోరుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI — రెండవసారి దిద్దుకొని సరిగా చెప్పారు.

Sri R. VENKATAJAGGA RAO :— Tank లలో నీళ్ళు లేని సమయంలో వ్యవసాయ కూలీలు సేద్యం చేసికొనుటకు తాత్కాలిక పట్టాలు ఇవ్వడానికి అవకాశం ఉందా? ఉంటే ప్రభుత్వం ఆ విధంగా చేస్తుందా?

(No reply)

Sri M. HANUMANTHA RAO :— Non-official తీర్మానాన్ని అమలు జరుపవలసిన నిబంధన లేదని చెప్పారు. మన non official తీర్మానాన్ని ఇష్టము ఉంటే అమలు జరుపుతారు, లేకుంటే తోసి వేస్తారు. దీనిని గురించి ఉపాధ్యక్షులవారు తీవ్రంగా

ఆలోచించవలెను. ప్రభుత్వం తరఫున రెవిన్యూ మంత్రిగారు ఇటువంటి ప్రకటన చేయడం శోచనీయం. ఈ అసెంబ్లి సభ్యులు చేసిన తీర్మానానికి విలువ ఉన్నదా? దానిని అమలు జరుపవలసిన అవసరం ఉన్నదా? వీటిమీద తప్పనిసరిగా ఒక రూలింగు ఇవ్వవలెను.

The Hon. Sri K. KOTI REDDI — మీరు ప్యాసు చేసిన resolution ను తూ. చ. తప్పకుండా ఆచరణలో పెట్టవలసిన అవసరంలేదు. దానిని enforce చేయవలెనంటే బిల్లు రూపములో వచ్చిన తరువాత అసెంబ్లీ ఆమోదించి ప్యాసు అయిన తరువాత ఆచరణలో పెట్టవలెను. Resolution అంటే గవర్నమెంటుకు ఆలోచించే అవకాశం వుంది. అది ముమ్మాటికి చెప్పవలసి యున్నది.

Sri T. NAGI REDDI —ఒకే ఒక ప్రశ్న అడుగుతూ ఉన్నాను. సభ్యులచేత ఏకగ్రీవంగా అంగీకరించబడిన తీర్మానమును అమలు జరుపవలసిన నైతికబాధ్యత ప్రభుత్వానికి ఉన్నదా లేదా అని అడుగుతూ ఉన్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI —We are following the rules and nothing more than that.

Sri T. NAGI REDDI .— I am also following the rules and nothing more than that.

Sri G. LATCHNNA —అసలు విషయాన్ని వదలిపెట్టి మిగతా విషయాలకు వెళ్ళారు.

Sri T. NAGI REDDI :—ఈ తీర్మానం మనమందరం అంగీకరించి మెజారిటీతో pass చేసినటువంటిది. అందరిచేత అంగీకరింపబడినటువంటిది. ఇది ఒక భాగంగా యిప్పుడు ప్రశ్న రూపములో వచ్చింది. దీనిని ఆచరణలో పెట్టటానికి ప్రభుత్వానికి చట్టంకాకపోయినంతమాత్రాన అసాధ్యమైందా?

DEPUTY SPEAKER — ఈవిషయం లీడర్సు అందరూ కూర్చొని settle చేసుకోవచ్చును. తరువాత question కు వెళ్ళుతున్నాను.

*Film Censor Board in Andhra.*

* 534 Q.—Sri K. KRISHNA RAO — Will the Hon. the Minister for Finance and Law be pleased to state

(a) whether a State Film Censor Board has been constituted in Andhra; and

(b) if so, when and who are the members of the Board now?

The Hon. Sri T. VISWANATHAM.—

Steps are being taken to constitute a State Film Censor Board.

State Film Censor Board నొక దానిని ఏర్పాటుచేయుటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

Sri K. KRISHNA RAO:—State Film Censor Board వారిని ఎవరు వేస్తారు. వారి కర్తవ్యము ఏమిటి?

The Hon. Sri T. VISWANATHAM:— దానిని గురించి శాసనము చేసేటటువంటి హక్కు సెంట్రల్ గవర్నమెంటువారికే వుంది. వారే ఆ బోర్డును వేయటం జరుగుతుంది.

*Director of Medical Services in Andhra*

* 505 Q.—Sri M. VEERABHADRAM:— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state.

(a) whether there is a proposal to extend the period of service (after retirement) of the person occupying the post of the Director of Medical Services and the Inspector General of Prisons; and

(b) if so, the reasons for the same?

The Hon. Sri D. SANJIVAYYA:—

(a) & (b) Dr. M. V. Ramanamurthi, the Director of Medical Services was superannuated with effect from 15th January, 1954. He is however allowed to continue in office pending consideration of the question of selection of his successor

Director of Medical Service ఉద్యోగములో వున్న వ్యక్తి జనవరి 15 తరువాత retire కావలసి వుండెను. తరువాత ఆరుమాసాలపాటు వీరిని re-employ చేశాము. నూతనముగా రాష్ట్రము ఏర్పడింది కాబట్టి ఈ శాఖ బాగా పని చెయ్యాలనే వుద్దేశ్యంతో అనుభవజ్ఞులైన వారిని కొంతకాలము వుంచదలచి ప్రభుత్వం ఆ విధంగా నియమించటం జరిగింది.

Sri M. VEERABHADRAM — ఈ ప్రశ్న డిశంబరు 12 వ తేదీన వేశాను. 6 మాసముల తరువాత, మంత్రి గారు సమాధానము చెప్పినందుకు కృతజ్ఞుడను. అక్టోబరులో యీ రాష్ట్రము వచ్చింది. వీరు జనవరిలో retire అయినారని చెబుతున్నారు. ఆఖరు నెలల కాలములో, ప్రభుత్వం వీరి సర్వీస్‌ను పొడిగించుటకు approve చేసి re - employment చేశారా అని అడుగుతున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA — ఈ ఆలస్యానికి కారణం నిజంగా ప్రభుత్వం వారిది ఏమీలేదు. అసెంబ్లీ session ఒకసారి sine-die గా adjourn అవటంవల్ల మళ్ళీ నోటీసు యివ్వటములో కొంత ఆలస్యం అయింది.

ప్రస్తుతం వారిని 6 మాసాలపాటు అదనంగా re-employ చేశాము. తరువాత, "సక్సెసర్" ఎవరని, నిర్ణయించుకొనుటకు యింకా 4 మాసాల time వుంది.

Sri K. V. VEMAREDDI - Will the Government realise at least at this stage that the principle of re-employing retired persons is far from good, when there are qualified persons of integrity?

The Hon. Sri D. SANJIVAYYA :— It is a very sound principle, no doudt, but under extraordinary circumstances we will have to show some sort of exception.

Sri T. NAGI REDDI :— అంత ప్రత్యేకమైనటువంటి, దాటలేని పరిస్థితులు ఏమి వచ్చినవి? అంత extraordinary circumstances ఏమి?

The Hon. Sri D. SANJIVAYYA — ప్రత్యేక మైనటు వంటి పరిస్థితులు ఏమిటో ఇందాక చెప్పాను. ఇది నూతనంగా ఏర్పడిన రాష్ట్రం. Composite State లో వుండగా, బాగా పనిచేశినారు. అందువల్ల యీ వుద్యోగం యిస్తే శక్తివంత ముగా నిర్వహించ గలరనే వుద్దేశ్యముతో వారిని మరల నియ మించటం జరిగింది. మన ఆంధ్రరాష్ట్రములో ఈ మెడికల్ సర్వీస్‌యందు administrative experience కలవారు కనుపించకపోవుటవల్ల కొంతకాలము వీరు ఆవుద్యోగంలో వుంటే బాగా సర్దుబాటు చేస్తారనే తలంపుతో ప్రభుత్వం ఆరు మాసాల పాటు వీరిని re-employ చేసింది.

Sri T. NAGI REDDI.- Retire అయినవారిని re-employ చేయకూడదని అది మంచి పద్ధతిగాదని, ఈ విషయమై ప్రజాభి ప్రాయముగూడా చాలా చోట్లనుండి వచ్చినట్లు ప్రభుత్వమునకు తెలుసునా? దానిని ధిక్కరించి, ప్రభుత్వం ఈ నిర్ణయం చేసిందనే సంగతి ప్రభుత్వం గుర్తించిందా? ప్రజలు ఒక అభ్యంతరం చెప్పిన తరువాత దానిని గురించి విచారించుట ప్రభుత్వ బాధ్యత కాదా?

The Hon. Sri. D. SANJIVAYYA —ప్రతివ్యక్తి ఉద్యోగ నియామకం విషయంలోనూ ప్రజలు అభ్యంతరాలు పెట్టుతునే వుంటారు. ఆ అభ్యంతరాలకు సాధ్యమైనంత వరకు విలువయిచ్చి అమలు జరపటానికి ప్రయత్నిస్తూవుంటాము.

Sri M. VEERABHADRAM — వీరు స్త్రీ వుద్యోగులపట్ల తమ వుద్యోగాధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నట్లు నేరాలు వచ్చిన తరువాత గూడ వారినే నియమించటంలో ప్రభుత్వ ఉద్దేశ్యం ఏమిటి?

The Hon. Sri D. SANJIVAYYA:— అటువంటి ప్రత్యేక మైన కేసులు ఏమైనా వుంటే వాటిని ప్రభుత్వమునకు తెలిపితే కఠినమైన, తీవ్రమైన చర్యలు తీసుకుంటాం.

Sri R. SIDDANNA GOWD.—ఈ House లో అటువంటి దులు అనేకమైనవి చేయబడలేదా?

The Hon. Sri D. SANJIVAYYA:— చేయబడినట్లు నాకు జ్ఞాపకము వున్నది.

14th May 1954]

Sri C. SUBBARAYUDU :— రిటైర్ అయిన వుద్యోగులను re - employ చేయుటంలో ప్రభుత్వమునకు ఒకపద్ధతి, అనేది వుందా ? అది ఏమిటి ?

The Hon. Sri D. SANJIVAYYA :— దానిని గురించి యిందాకనే చెప్పాను, కొన్నిచోట్ల పనులు సమర్థతో నిర్వహింప బడవలసి నప్పుడు కొన్నిప్రత్యేక పరిస్థితులలో పాతవారినే re - employ చేయవలసి వుంటుంది.

*Anantapur Oil Technological Institute.*

*506 Q.—Sri T. LAKSHMINARAYANA REDDI :— Will the Hon. the Minister for Education and Industries be pleased to state

(a) the number of students studying in Anantapur Oil Technological Institute ; and

(b) the amount spent on the Institute in 1952 and 1953 ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO —

(a) 9 students are studying in the Oil Technological Institute, Anantapur, 3 in the 2nd year and 6 in the 3rd year.

(b) The amount spent is as follows.

| | | |
|---|---|---|
| 1952—53 | .... | Rs. 1,05,906 |
| 1953—54 (upto 31—1—1954) | .... | Rs. 96,950 |

(a) : రెండవ సంవత్సరములో ముగ్గురు, మూడవ సంవత్సరములో ఆరుగురు కలిపి అనంతపురం Oil Technological Institute లో మొత్తం 9 మంది విద్యార్థులు వున్నారు.

(b) : 52-53 వ సంవత్సరములో అక్కడ ఖర్చుపెట్టిన మొత్తం రు. 105,905 లు.—1953-54 సంవత్సరములో 31-1-54 వరకు రు, 96,950 లు.

[14th May 1954

Sri T. LAKSHMINARAYANA REDDI :— ఈ Institute లో విద్యార్థులు మూడు సంవత్సరాలు వుంటారు. ప్రాక్టికల్ ట్రయినింగ్ అయిన తరువాత వీరికి డిప్లమాలు యిస్తారు. ఈ డిప్లొమాలు పుచ్చుకొని వీరు ఉద్యోగాలకు వెళ్ళితే, యీ డిప్లొమాలను ఆమోదించటం లేదు.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — ఇది 5 సంవత్సరముల కోర్సు. ఇందులో మూడు సంవత్సరములైన తరువాత ఒక డిప్లొమా యిస్తారు. వీరికి ఉద్యోగాలు వస్తవా? లేదా అంటే ఆ qualification గలవారు, కావలసిన స్థలాల్లోకి వెళ్ళితే, వారిని ఉద్యోగాల్లోకి తీసుకుంటారని ఆశిస్తున్నాను. ఈ కోర్సును డిగ్రీ కోర్సుగా మార్చటానికి వీలు లేదు. డిగ్రీ కోర్సుకు—డిప్లొమా కోర్సుకు చాలా తేడా వున్నది. దీనిని degree course గా మార్చటానికి ప్రభుత్వము నకు వుద్దేశ్యము లేదు.

Sri N. VENKATAIAH —వీరిని ఉద్యోగములలోకి తీసుకొనటానికి ఆంధ్రరాష్ట్రములో అవకాశం వుందా? ఎక్కడ వున్నది?

The Hon. Sri S. B P. PATTABHIRAMA RAO — ఈ కోర్సు pass అయిన వారందరికీ వుద్యోగ అవకాశాలు వున్నవా? లేదా? అన్నది పెద్ద ప్రశ్న.

Sri N. VENKATAIAH .—దీనికి ప్రత్యేకమైన అవకాశాలున్నాయా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— ఆంధ్రదేశం లోనే ఎందుకు వుండాలి? దేశం మొత్తం మీద ఎక్కడ అవకాశాలు వుంటే, అక్కడే ఉద్యోగాలు సంపాదించుకోవచ్చును గదా?

Sri C. PULLA REDDI :— ఈ Institute లో, మంత్రిగారు చెప్పినట్లుగా, చదువుకొంటున్న విద్యార్థులు 9 మందే అయినా, ఖర్చు మాత్రము దాదాపు లక్ష రూపాయలు అవుతున్నదన్నారు. అంత డబ్బు ఖర్చు కావటానికినీ అంత కొద్దిమంది విద్యార్థులు చదవటానికిని కారణా

లేమిటి? వారికి ఇంత establishment chargersఎందుకు? వీనిని మంత్రి గారు వివరిస్తారా ?

The Hon. Sri S B. P. PATTABHIRAMA RAO.— నేను ఇదివరకు చెప్పిన సమాధానాన్ని బట్టే తెలుసుకోవచ్చును. ఎందుచేత ఎక్కువ విద్యార్థులు రావడం లేదంటే నేను ఏమి చెప్పను. ఎందుచేతనో రావడంలేదు, Institute మట్టుకు చాలా పెద్దది. కొన్ని లక్షల విలువగల యంత్రసామాగ్రి అక్కడ ఉన్నది. Composite State నుంచి తెచ్చుకో గలిగిన భాగ్యాలలో ఇది ఒక భాగ్యమనుకో వలసియున్నది. అటువంటి Institute ను మనము ఏవిధంగా ఉపయోగించుకొంటే ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందో ఆలోచించవలసి యున్నది. దీన్ని గురించి మన Director of Industries తో సంప్రతించి వారిని ఈ విషయములో ఒక రిపోర్టు పంపించవలసిందిగా చెప్పాను. త్వరలోనే ఆ రిపోర్టు వస్తుంది. కేంద్రప్రభుత్వపు Central Oil Technological Institute తో కూడ సంప్రదింపులు జరిపి ఏ పద్ధతిలో దీనిని ఉపయోగిస్తే బాగుంటుందనే వారి అభిప్రాయాన్ని కూడ తెలుసు కొంటాము.

Sri T. NAGI REDDI — ఈ Technological Institute అనేది ఈనాడు చాలా ప్రధాన మైనటువంటిదని ప్రభుత్వానికి తెలుసును. అటువంటప్పుడు, దీనిని ఏవిధముగా అయితే అభివృద్ధి చేయగలము, ఏ విధముగా ఈ courses లో ఎక్కువమంది విద్యార్థులను తర్ఫీదు చేయగలము అనే విషయాన్ని పరిశీలించ డానికిన్ని ఈ courses ను degree courses గా మార్చ గలిగితే అక్కడి విద్యార్థులు institute లో ఉన్నటువంటివారు బయటికి పోయిన తరువాత Industrial concerns కు ఉపయోగ పడతారనే విషయాన్ని గురించి పరిశీలించ డానికిని ప్రభుత్వము ఒక ప్రత్యేకమైనటువంటి Experts Committee ని వేసి నిర్ణయించ వలసిందని కోరుతున్నాను. దీనికి మనము చాలా ఖర్చు పెడుతున్నాము. ఆ ఖర్చును సక్రమంగా ఉపయోగించాలంటే ఒక సక్రమమైన పద్ధతి అవసరము కనుక ఇది సక్రమమైన పద్ధతి అని ప్రభుత్వము వారు భావిస్తున్నారా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO—
Degree courses పెట్టడానికి నేను ముందే మనవి చేసి నట్లుగా, విశ్వ విద్యాలయంవారు అంగీకరించాలి. ఇప్పుడు విశ్వ విద్యాలయం బిల్లు ఒకటి పెట్టాము. ఆ విశ్వ విద్యాలయము తయారైన తరువాత అది ఆ విధంగా చేయవచ్చు. రెండవది ఇంతకు ముందు చెప్పినట్లుగా ఈ విషయాన్ని పరిశీలించి రిపోర్టు పంపవలసిందిగా Director of Industries ను కోరాము. త్వరగా ఆ రిపోర్టుకూడ వస్తుంది. ఆ రిపోర్టు వచ్చిన తరువాత అవసరమైతే Experts Committee ని వేస్తాము. ఈ విశ్వ విద్యాలయము తయారైన తరువాత దీనిని ఏవిధంగా ఉపయోగించుకొంటే బాగుంటుందో ఆ విధంగా చేయమని చెప్పుదాము. ఇది చాల పెద్ద Institute. మంచి technical experts కూడ ఉన్నారు. Head of that Technological Institute కూడ చాలా తెలివిగలవారు, బాగా చదువుకొన్నవారు. ఇంత ఉన్నప్పటికిని ఎక్కువమంది విద్యార్థులు రాకపోవడం కొంత శోచనీయంగా ఉన్నది.

Sri G. NAGABHUSHANAM.—Inspite of having advanced and up-to-date machinery, is there any research work done in that institution ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO —
All that is done is supposed to be research work.

Sri K. V. RAMESAM. It is admitted that only very few people are attending the institute and evidently there is no sufficient encouragement for the students. If so, why don't you think of shifting that machinery and the institution to other parts of Andhra where there is sufficient incentive and where the students may flock in large numbers and take advantage of that institution ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO—
I am afraid I cannot take it without a pinch of salt.

*Assignment of house sites in Hindupur.*

* 507 Q.—Sri G. SIVASANKARA REDDI —Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state

(a) whether the Government have received petitions requesting that the respective house sites in town survey number 69 at Hindupur may be assigned to those, who have already erected dwelling houses and huts; and

(b) if so, the action taken thereon?

The Hon. Sri P. THIMMA REDDI.—
(a) and (b) — The answer is in the negative.

గౌరవనీయ సభ్యులు ప్రశ్నలో అడిగినట్లుగా ఆలాంటి అర్జీలు రాలేదు. కనుక ఆ అర్జీలు గురించి ఎలాంటి చర్యతీసుకోవడానికి అవకాశము లేకపోయింది.

Sri P. PUNDARIKAKSHACHARYULU — ఈ Towns క్రింద చెప్పబడే మునిసిపాలిటీలు, మేజర్ పంచాయితీబోర్డులు survey అయినాయా, ఇవి survey కావడం ముఖ్యమని మంత్రిగారు గుర్తించి మేజర్ పంచాయితీలను survey చేయిస్తారా?

The Hon. Sri P. THIMMA REDDI— దీనికి ప్రత్యేక ప్రశ్న వేస్తే బాగుంటుంది. అసలు పుండరీకాక్షాచార్యులు గారు హిందూపురమును చూడలేదను కొంటాను.

Sri K. KRISHNA RAO — రూల్సు ప్రకారం Members ప్రశ్నలు వేస్తున్నారంటే, దాని యొక్క complexity తెలుసుకొని, దానియొక్క responsibility తీసుకొని వేస్తున్నారు. ఆ విధంగా responsibility తీసుకొని, ఒక ఫలానా విషయంలో representation ఏమైన వచ్చిందా అని ప్రశ్న వేస్తున్నారు. అటువంటప్పుడు, ఆ ప్రశ్నలను చౌకబారుగ క్రింది అధికారులు తీసుకొని 'No' అని చెప్పితే, రెండవ question arise కాదు. ఆ విధముగా సమాధానాలు చౌకబారుగా చెప్పడం జరుగుతున్నది గనుక ప్రభుత్వము ఇటువంటి ప్రశ్నలను జాగ్రత్తగా పరిశీలించి, సభ్యుల యొక్క హక్కును గుర్తించి జాగ్రత్తగా

జవాబులు ఇవ్వవలసి యుంటుంది. సభ్యులు responsibility తీసుకొని వేసిన ప్రశ్నలకు ఈవిధంగా చౌకబారుగా సమాధానాలు చెప్పడమంటే సభ్యులు అబద్ధాలు చెప్పినట్లు అవుతుంది. కనుక ఇటువంటి ప్రశ్నలకు ప్రభుత్వము జాగ్రత్తగా సమాధానం ఇవ్వవలెనని కోరుకున్నాను.

The Hon. Sri P. THIMMA REDDI — క్రిష్ణరావుగారు మేము చౌకబారుగా సమాధానాలిస్తున్నామని చెప్పుచున్నారు. సాధారణంగా వారు వేసే ప్రశ్నలు కూడ చౌక బారుగానే ఉంటాయి. అలాంటి ప్రశ్నలకు ఆ విధంగానే జవాబు లివ్వడానికి మంత్రులుగూడ సిద్ధముగా ఉన్నారు. అసలు ఇది ఒక ప్రశ్న అనిపించుకోదు. ప్రశ్నలో ఒక భాగము కూడ కాదు. ఏదో ఒక మునిసిపాలిటీలో ఒక చోట కొందరు గుడిసెలు వేసుకొంటే, వారికి sites assign చేసే విషయం గురించి petitions వచ్చాయా లేదా అని తెలుసుకొనడానికి ప్రభుత్వము అంత కష్టపడవలసిన పనిలేదు. ఇలాంటి ప్రశ్నలు అనేకము వస్తూ ఉంటాయి.

Sri R. SIDDANNA GOWD — అధ్యక్షా, నేను ఒక point of order ను raise చేస్తున్నాను.

Sri T. NAGI REDDI — ఇటువంటి ప్రశ్న వేయడం చాలా అసందర్భమని, అటువంటి ప్రశ్నలు వేసినదానికి అటువంటి సమాధానమే వస్తుందని చెప్పిన సమాధానము, ఈ ప్రశ్న వేసినటువంటి వారికిని, ఈ సభయొక్క dignity కిని చాలా లోపముగా యుంటుందని మనవి చేస్తున్నాను. ఒక M. L. A. తన ప్రజలకు అన్యాయం జరిగిందని తెలుసుకొని, ఆ విషయ సేకరణ ప్రభుత్వోద్యోగులనుండి అందలేదనే కారణముచేత, ఇక్కడ దాన్నిగురించి ప్రశ్న వేసినప్పుడు అటువంటి ప్రశ్నకు సభలో సమాధానం చెప్పుటకు యిష్టపడనప్పుడు వారికి ప్రత్యేకంగా సమాధాన మిచ్చుకొని ఆ ప్రశ్న రాకుండా చేసుకోవాలి. అదేది చేయకుండా ప్రశ్న admit అయి, అసెంబ్లీ floor మీద వచ్చినప్పుడు చీమకుట్టినటువంటి దానికిగూడ ప్రశ్న వేస్తున్నారని, అటువంటి ప్రశ్నకు చీమకుట్టినట్లుగానే సమాధానమిస్తామని చెప్పడం యే మాత్రం సభ్యంగా లేదు. This is not the way of replying. కనుక ఇకముందు అటువంటి సమాధానాలు యివ్వకుండా చేయవలెనని కోరుతున్నాను.

DEPUTY SPEAKER — ఒక గౌరవనీయ సభ్యుడు ఒక ప్రశ్న వేసినప్పుడు మంత్రులు ఆ విధంగా సమాధాన మివ్వడం సవ్యంగా వుండదు. కనుక మంత్రులు సమాధానా లివ్వడంలో కొంత జాగ్రత్తగా ఇవ్వవలెనని కోరుచున్నాను.

Sri R. SIDDANNA GOWD.—This is not the first time that the Hon. Minister for Local Aadministration talks in this way.

DEPUTY SPEAKER :—నేను మాట్లాడుతున్నానని మీకు తెలుసునా, అయితే మీరెట్లా మాట్లాడుతున్నారండీ.

Sri K. KRISHNA RAO —అధ్యక్షా ! On a point of personal explanation, Sir, మంత్రి తిమ్మారెడ్డిగారు జవాబులు యివ్వడములో ఆయన ఎందుకు ఆ విధంగా జవాబులు చెబుతున్నారో తెలియ లేదు. ఒక సభ్యుడు బాధ్యతవహించి ఒక ప్రశ్న వేసినప్పుడు, ఆయన దానికి సంబంధించిన విషయమంతా తెలుసుకునే ప్రశ్న వేశారని తెలుసుకోవాలి. కాని ప్రభుత్వోద్యోగులు తయారుచేసే సమాచారాన్ని ఆధారంగా తీసుకొని మంత్రిగారు చాలా చౌకబారు సమాధానాలు చెప్పడం జరుగుచున్నది. ఆ విధముగా జవాబులు చెపితే, సభ్యుల హోదాకు, హక్కులకు భంగముగా వుంటున్నది.

The Hon. Sri P. THIMMA REDDI — అధికార రీత్యా వచ్చిన ప్రశ్నలకు జవాబులు చెబుతునేవున్నాను. చౌకబారుగా ప్రశ్నలు వేస్తే, వాటికి చౌకబారు జవాబులే యివ్వడమయింది. కాని అధికారరీత్యా జవాబు యిస్తే అది చౌకబారు జవాబు అని క్రిష్ణారావుగారు అనడం మంత్రిని అగౌరవపరచినట్లుగానే కనబడుతుంది. కాని ప్రభుత్వోద్యోగుల మీద ఆ విధంగా ఆరోపణలు చేయడం మంచిదికాదని మనవి చేస్తున్నాను.

DEPUTY SPEAKER :—ఈ విషయములో నేను యిదివరకే నా అభిప్రాయమును చెప్పాను. అందుచేత యికమీదట ఈవిషయములో discussion అనవసరము, Next question please.

Sri P. VENKATASUBBAYYA :— నేను ఒక ప్రశ్న యిచ్చాను. దానికి యింకను అవకాశము యివ్వలేదు. దాన్ని Speaker గారు గమనించాలని అంటున్నాను.

*Amount given by the Central Government towards expenditure on Buildings and tents in Kurnool.*

*508 Q —Sri T. LAKSHMINARAYANA REDDI.—Will the Hon. the Chief Minister be pleased to state

(a) The amount given by the Central Government towards expenditure on buildings and erection of tents in Kurnool till November 30th; and

(b) The names of the Contractors who were given major works on contract ?

The Hon. Sri T. PRAKASAM —

Clause (a) — The Government of India sanctioned (in July 1953) a loan of Rs. 40.0 lakhs for meeting the expenditure liable to be incurred in connection with the location of the temporary capital of the Andhra State at Kurnool. No other amount has been given by the Central Government so far towards construction of buildings at Kurnool.

Clause (b) —A list* showing the names of Contractors, number of works done by each and the total payments made to them is placed on the Table of the House.

1953 సంవత్సరము జులై నెలలో కేంద్రప్రభుత్వమువారు నలభై లక్షల రూపాయలు యీ విషయములో అప్పుయిచ్చారు. అంతకు మినహా ఏ విధమైన అప్పుకూడా వారు యివ్వలేదు. యీ గవర్నమెంటు తీసుకోనూగూడా లేదు. దీన్ని గురించిన statements contractors పేర్లు విడివిడిగా తయారుచేసి ఇక్కడ table మీద పెట్టబడినవి.

Sri T. LAKSHMINARAYANA REDDI :— డిప్యూటీ ముఖ్యమంత్రిగారు కంట్రాక్టుకు యిచ్చిన వారిలో చెబుతూ కొందరికి కంట్రాక్టుకు conditions లేకుండా tenders పిలువకుండా యిచ్చామని అన్నారు. అటువంటి పరిస్థితులలో ఎంతపరసెంటు లాభము వీరికి యిచ్చారో చెబుతారా ?

* Vide Appendix at page 423 infra.

The Hon. Sri T. PRAKASAM :— ఈ contracts విషయములో చిన్న చిన్న tenders గా భాగించి వారికి యిచ్చారు. కారణమేమిటంటే ఆంధ్రరాష్ట్రము రాకముందే ఆరంభించిన కార్యక్రమము యిది. 15 దినములలో అన్నిపద్ధతులను అనుసరించ లేకపోవడమువల్ల ఆ విధంగా కంట్రాక్టు యివ్వవలసి వచ్చింది.

DEPUTY SPEAKER :— Other questions will be taken up tomorrow.

టైము అయింది గనుక, తతిమ్మా ప్రశ్నలు రేపుతీసుకుందాము.

Sri K. KRISHNA RAO :— టైము అయినదని అంటున్నప్పుడు, యీ ప్రశ్న రేపటికి వాయిదా వేయమని కోరుతున్నాను.

Sri P. VENKATASUBBAYYA :— నేను ఒక ప్రశ్న యిచ్చాను. అది యివ్వాళనే వస్తుందని ఆశించాను. కనీసము రేపు అయినా వస్తుందండీ ?

*II Message from the Governor*

DEPUTY SPEAKER — The following message dated 5th May, 1954, has been received from the Governor of the State of Andhra.

"in pursuance of Art. 207 (clause (1) of the Consititution of India, I, C. M, Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Andhra Legislative Assembly of the Andhra Irrigation (Levy of Betterment contribution) Bill 1954"

*III Point of order re · Business of the House*

Sri G. LATCHANNA :— అధ్యక్షా! ఈ ఎసెంబ్లీ కార్యక్రమము ఏమిటో సభ్యులకు విశదము గావడములేదు. ఏ రోజున ఏ సమస్యపైన చర్చ వస్తుందో, ఎన్నాళ్ళు యీ సభ జరుగుతుందో, ఏది ముఖ్యము, ఏది వెనుక అనేదికూడ తెలియడములేదు, నాకు తెలిసినంత

మట్టుకు ఏ శాసన సభలోను సభాకార్యక్రమము, agenda శాసన సభ్యులకు తెలియకుండా జరగలేదు. విశ్వనాథంగారి హయాములో గూడా జరగలేదు. ప్రస్తుతము జరిగే కార్యక్రమము కనీసము ఒక వారము రోజులు జరుగుతుందో ఎప్పుడు ముగింపుకు రాగలదో మంత్రులతో సంప్రదించి చెప్పకపోతే చాలా యిబ్బంది కలుగుతుంది. ఇందులో సభ్యులకు చాలా యిబ్బందిగా వుంటున్నది కాబట్టి, యికమీదట యీ సభాకార్యక్రమము ఎన్ని రోజులు జరుగుతుందో మంత్రివర్గముతో ఆలోచించి సభ్యులకు తెలియజేయాలని మనవిచేస్తున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI -- Sir, రేపు Electricity Bill తీసుకుంటున్నాము. తరువాత మాచ్ఖండ్ ప్రాజెక్టు చూడాలని మన మెంబర్లలో కొంతమంది ఆపేక్ష తెలిపిచ్చారు. అందువల్ల యీనెల 20 వ తేదీ నుంచి మూడు దినములు అనగా 20, 21, 22 తేదీలు ఎసెంబ్లీ వుండదు. అక్కడికి వెళ్ళదలచినవారు ఎవరైతే వుంటారో వారు వెళ్ళవచ్చును. ఇక్కడినుంచి బస్సులు ఏర్పాటు చేస్తారు. ఈ బిల్లు తరువాత మాత్రం Electricity బిల్లు వస్తున్నది. ఇది యిప్పటివరకు ఎసెంబ్లీ Programme తరువాత వేరే బిల్సు మీముందు రావు. మేము introduce చేసేది Electricity బిల్లు, గుంటూరు Acquisition of Building of property Bill. ఇవి చాలా చిన్నబిల్సు. మీరందరు ఒప్పుకుంటే ప్రవేశ పెట్టదలచాము. Endowment బిల్లు సుప్రీంకోర్టులో invalid అయినందువల్ల, యిప్పుడు దీన్ని validate చేసుకోటానికి బిల్లు పెట్ట పోతున్నాము. ఇప్పుడు introduce చేసిన బిల్లు ఒకటి, రెండువున్నవి. అంతకన్నా వేరేబిల్సు తీసుకొని రావడములేదు. ఈ బిల్లును మీరు ఎంత త్వరలో ముగిస్తే అంత త్వరగా మనము వెళ్ళిపోగలము. University Bill యివ్వాళతో పూర్తి అవుతుంది అనుకున్నాము కాని అట్లు జరగలేదు. రేపటివరకు జరిగేటట్లుగా వున్నది. ఈ University Bill Select Committee కి refer చేస్తున్నారు. కాబట్టి సెలెక్టు కమిటీకి వెళ్లుతుంది. ఇంకొక రోజున Village Bill ప్రవేశపెడదామని అనుకొన్నాముగాని, దాన్ని ప్రవేశ పెట్టడము లేదు,

తరువాత Betterment tax బిల్లు introduce చేస్తామని వుంది. ఆ విషయము తరువాత ఆలోచించుకోవచ్చు. ఈపని అంతయు యీ నెల 30 వ తేదీ లోగా పూర్తి కావలసివుంది. కాబట్టి మీరు ఎంత త్వరగా ముగిస్తే అంత త్వరగా యిళ్ళకు పోవచ్చును. లచ్చన్నగారు వారి కార్య క్రమము యేదైనా వుంటే వారు దీన్నిబట్టి ఏర్పాటు చేసుకోవచ్చు. ఆయనకేమీ అనుమానము అక్కరలేదు. ఇదే కార్యక్రమము యీ సమావేశమునకు సంబంధించినంత మట్టుకు.

Sri G. LATCHANNA — Deputy Chief Minister గారు చెప్పిన items లో రామమూర్తి కమిటీ రిపోర్టు విషయము రాలేదు. అదే గాలికి ఎగిరి పోయినట్లు కన్పిస్తున్నది. గత కర్నూలు సమావేశములో రేపు వాల్తేరు సమావేశములో వస్తుందని మంత్రి పట్టాభిరామారావుగారు వాగ్దానము చేశారు. ఈ వాగ్దానాల కన్నిటికి విలువ ఎక్కడ అని అనుకుంటున్నాను. ఈ "రేపు" అనే పదము బడిలో స్కూలుపిల్లల కొరకు గోడమీద వ్రాసిన విధంగా యీ సమావేశముకాదు, రేపువచ్చే సమావేశము అని వ్రాసుకోవాలి అన్నమాట. విశాఖపట్టణం సమావేశములో తప్పక చర్చకు వస్తుందని చెప్పినప్పుడు, యిప్పుడు అది రాకపోవటము, దీనికి విలువ వున్నదా? గవర్నమెంటు కార్యక్రమము ప్రకారము రామమూర్తి కమిటీ రిపోర్టు శాసనసభ వారికి యిచ్చిన ప్రోగ్రాము ప్రకారము, చేసిన ప్రకటననుబట్టి అది యీ సమావేశములో రావలసి యున్నది. ఈ విషయము కనుక్కొని చెబుతారా? అని అధ్యక్షుల వారిని కోరుతున్నాను.

(At this stage Mr. Speaker occupied the Chair)

Mr. SPEAKER :— ఈ విషయము నిన్ననేవచ్చింది. నాగిరెడ్డిగారు అడగగా, మంత్రిగారు సమాధానము చెప్పారు. It was raised by the Leader of the opposition and some answer was given by the Minister.

The Hon. Sri N. SANJEEVA REDDI:— రామమూర్తి కమిటీ రిపోర్టు చర్చ జరగకుండా చేయడం మా అభిమతం కాదు. ఈ వ్యవహారాన్ని ఎదుర్కోవాలనే మేము అభిలషిస్తున్నాము, ఈ సమస్యపైన ఒక అనధికార తీర్మానం చర్చకు

ఎలాగూ రానున్నది. ఆరిపోర్టు చర్చించిన తరువాతనే మనమందరము యిళ్ళకు వెళ్లిపోదాము. అంతేగాని ఆరిపోర్టు చర్చకు రాకుండా చేసి పరుగెత్తుకొనిపోవాలని మాకు లేదు. బి కృష్ణమూర్తి రావుగారు, నరసింహారెడ్డిగారు యిచ్చిన తీర్మానాలు గూడా చర్చించినతరువాతనే మనము వెళ్ళుదాము.

Sri T. NAGI REDDI — అధ్యక్షా, I am surprised at the answer. అనధికార తీర్మానము అసలు చర్చకే రాకపోవచ్చు. అంతకు ముందు వ్యవసాయ సంస్కరణలకు సంబంధించినది మరొక అనధికార తీర్మానము వున్నది. కొద్ది వ్యవధిలో దాన్ని పూర్తిచేయలేము. రామమూర్తి కమిటీ రిపోర్టు అసలు చర్చకు రానేరాదేమోనని మా అనుమానం.

ముందు ఒక Non - official day కు ఒక రోజు కేటాయించి, ఆ రోజున Non-official తీర్మానాలలో నరిసింహారెడ్డిగారు పెట్టిన తీర్మానం చర్చకు వచ్చినప్పుడు, అది చర్చించటానికి వీలు కలుగుతుంది కదా అని సంజీవరెడ్డిగారు అన్నారు అసలు తీర్మానాలన్నీ రద్దుచేసి తరువాత ఒకరోజో, రెండురోజులో దాటవేస్తే అసలు యీ తీర్మానం చర్చకు రాకుండాచేస్తే అది రాకపోవచ్చు. అందుచేత ప్రభుత్వము చేసిన వాగ్దానాన్నిబట్టి దానికి మాత్రం ఒకరోజు ప్రత్యేకంగా కేటాయించి ఆ తీర్మానమునుగురించిన రిపోర్టు చర్చించటానికి అవకాశమిచ్చి ఆరోజునే దాన్నిగురించే decide చేయటానికి వీలు కలుగజేస్తామని ప్రభుత్వము వాగ్దానము చేసింది. ఇటువంటి వాగ్దానాలు యింతవరకు ఎన్నో అయినవి. వాటిని ప్రభుత్వము ఏవిధంగా ఆచరణలో పెట్టదలచిందో, ఆ విధంగానే యిప్పుడు యిచ్చిన యీ Non-official day రోజున Non-official తీర్మానాన్ని discuss చేయవచ్చునని అనుకొన్నాము కాని అది అట్లా జరగలేదు. అది సరియైనపద్ధతి కాదు. తరువాత agrerian తీర్మానము ఒకటి వున్నది. తరువాత రామక్రిష్ణారెడ్డిగారు యిచ్చిన తీర్మానము ఒకటి వున్నది. అది 10, 15 నిమిషాలలో పూర్తిఅయ్యేదికాదు. ఈ బిల్లు ఏవియును రావనే అభిప్రాయమును ప్రభుత్వము కలిగించుచున్నది.

The Hon. Sri N. SANJEEVA REDDI — రాదని ఏమీ కాదు. అది పరిశీలనకు రాకపోయినా కమిటీవారి రిపోర్టును చర్చించినతరువాతనే మనము యిక్కడనుంచి యిళ్ళకు వెళ్లుదాము.

Sri T. NAGI REDDI — (శ్రీ) నరసింహారెడ్డిగారి తీర్మానం రాదు అని తోస్తే, దానిని discuss చేసిన తరువాత యిండ్లకు పోదాము. ఆ తీర్మానము చర్చకు వస్తే ముందుగానే రానివ్వండి. అట్లా రాకపోతే, దానికి ఒక రోజు కేటాయించి, దీనిని discuss చేద్దాము.

Sri G. LATCHANNA — రాకపోతే అని చెప్పటం అప్రస్తుతము. Government agenda లో Ramamurty Committee report ఫలానా రోజున చర్చకు పెడతామని దానికి ఒక రోజు కేటాయించి చెప్పకపోవటం, అది కాస్తా చేయటం, యిది నాబోటివారికి ప్రజలకు ఆదుర్దాను కలుగ జేస్తున్నది. మంత్రిగారికి ఆదుర్దాలేకపోయినా ప్రజలు ఆదుర్దా పడుతున్నారు. అది సహజం. చాలమంది ఆందోళన జేస్తున్నారు. అందువల్ల programme ప్రకారము, Government agenda ప్రకారం ఒకరోజు కేటాయించాలని, Ramamurty Committee Report discuss చేయాలంటున్నాను. అంతే కాని యిది పద్ధతికాదు. ఎవరోయిచ్చినతీర్మానము రాకపోతే యిదిపెడతాము. లేకపోతే,యిది పెడతాము అనేపద్ధతి సబబైనదా ? Ramamurty Committee ఫలానా రోజున Assemblyలో discussion కు వస్తుందని announce చేసి, ఆ Ramamurty Committee Report ను Assembly ముందు discuss చేయవలసిన అవసరము వుంది. ఎప్పుడు యీ బిల్లు discussion కు ప్రవేశ పెడతారో యే రోజున వస్తుందో తెలియ జేయాలి.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా ఇందులో ఒక technical difficulty వుంది. అది అంతా overrule చేశారు. మళ్ళీ యీ non-official resolutions అన్నీ ballot వేయాలి. ప్రతి week యీ resolutions ballot వెయ్యాలి. అంటే ప్రతి non - official రోజున resolutions అన్నిటినీ ballot వెయ్యాలి. మొదటి 15 రోజుల వరకూ వచ్చిన resolutions

అంతకు పూర్వము వున్న resolutions వున్నాయి. అన్నీ కలిపి ballot వెయ్యాలి. (Interruption) వెయ్యకుండా వుండడానికి యెవ్వరికీ అధికారములేదు. తరువాత 10 రోజులలో వచ్చిన rsolutions వుంటే, అప్పుడు వాటిని అన్నిటినీ కలిపి ballot వేసే అవకాశం కలుగజేయాలి. అందుచేత ballot తప్పకుండా వేయాలి. That cannot be escaped. దానికి మీరు అవకాశము యివ్వాలి. వారు యిచ్చిన అధికారము వుందా? మా చేతుల్లోనూ లేదు. వారి చేతుల్లోనూ లేదు. Ballot లో వస్తేచేస్తాము అంటే లాభంలేదు. Non-official day విషయం వదలివేయండి. ఇది ముఖ్యమైన విషయము. ఇది తప్పవేరే విషయం వుంటే చెప్పమనండి. Ballot వేస్తేవేస్తాము. అని చెప్పడం చాల పొరపాటు. అందువల్ల ballot లేకుండా తీసుకు రావడానికి వీలులేదు.

Sri G. LATCHANNA :— దానికి మేము object చేస్తాము.

Sri V. CHIDANANDAM :— Non — official day తీసుకువస్తారా లేదా అనేవిషయం తేలితే, యిది తేలిపోతుంది.

Mr. SPEAKER :— Non-official day ballot లో ప్రథమస్థానం రాకపోతే, వాత్తేరు సమావేశము పూర్తి అయ్యేలోపల తీసుకువస్తామని చెప్పారు. Is it not clear.

Sri T. NAGI REDDI — ఇది యెట్లావుందంటే non-official day మనం వెళ్ళిపోయేటప్పుడు రావచ్చు. ఆ non-official day రోజున వస్తుందో రాదో అది చూచి, అప్పుడు Programme fix up చేస్తామని చెపుతారా? అసలు దీనికి బదులు యిప్పుడు వున్న non-official day వున్నదీ, లేనిదీ త్వరగా తేల్చాలి. ఇప్పుడువున్న non-official day యేనాడు వస్తుందో ఆలోచించిందా? మనం capital issue discuss చేసినప్పుడు non-official day యిస్తామన్నారు. అట్లా యిస్తామన్నప్పుడు ప్రభుత్వమే ఒక దినం కేటాయించి తరువాత యింకొక తీర్మానం వచ్చే అవకాశము లేకపోతే, ముందు వచ్చిన తీర్మానం చర్చకు తీసుకు వచ్చారా? ఈ విషయం decide చేశామని చెపుతూ అట్లాగే మున్న కర్నూలు సమావేశంలో మంత్రిగారు యిచ్చిన వాగ్దానంకూడా

అలాంటిదే. ఇప్పుడు యీ తికమకలు యెందుకు? లేకపోతే ఆలోచిస్తాము, అలాంటి ifs and buts చాలా dangerous. ఈ వేళ యీ క్లిష్టమైన సమస్యపైన వాగ్దానం చేసిన అది మంచిది, అని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. Non-official days వున్నాయని చెబుతున్నారు. మేము non-official days చాలా పోగొట్టుకున్నాము. కాబట్టి non-official days విషయం యిది. అందుచేత మాకువున్న non-official days ప్రభుత్వ చేతుల్లో పడితే, మాకువుండే కొద్ది అవకాశం పోతుంది. మేము దానిని వదలిపెట్టదలచుకోలేదని చెబుతున్నాను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— గత సమావేశంలో యిది నేను move చేసినప్పుడు చర్చకు ఒకరోజు ప్రత్యేకిస్తామని వాగ్దానం చేసినమాట నిజం. వచ్చే sessions లో ఒక రోజును ప్రత్యేకిస్తామని నేను ఛలోక్తిగా నవ్వుతూ చెప్పిన మాటలను సభ్యులు అర్థంచేసుకోలేదు. దానిని వారు నాలా serious గా తీసుకొన్నారు. సభ్యులు ఖచ్చితంగా మాట్లాడితే నేను ఆలాగున అన్నాను. "ఈ సమావేశంలో ముఖ్యమైన bills చాలా వున్నవి. కాబట్టి next session దానిని తీసుకోవచ్చును." చర్చను వాయిదా వెయ్యాలనిగాని, చర్చకు అవకాశం యివ్వకుండా avoid చేయ్యాలనిగాని నా అభిమతంకాదు. నేను ఆ విధంగా avoid చేసే మనిషిని కాను. (Laughter.) మీాకు యిది యెంతో సామాన్యమైన పని.

Sri T. NAGI REDDI:— Cabinet లో వుండే పరిస్థితులు ఆవిధంగా వున్నవనుకొన్నాను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— నేను చెప్పేది వినండి. సభ్యులతో సమాలోచనలు జరిపినగాని అది మేము చేయము. ఈ సమావేశంలో ముఖ్యంగా చాలా bills వున్నవి. ఈ bills ముగిసేలోపల ఏదో ఒక రోజు కేటాయించాలనుకొంటున్నాము. మంత్రుల సమావేశములో నేను పాల్గొని, వారితో కలసి మాట్లాడలేదు. నేను మీాకు ఆలోచించి

చెబుతానుకదా, మీరు వూరుకోండి అని అంటున్నాను. నేను వాగ్దానంచేసినమాట వాస్తవమే. నేను చేసిన వాగ్దానమునకు సంబంధించి అది యేమైనదో జవాబు చెప్పలేదని చెప్పారు. కాబట్టి నేను మనవిచేసేది యేమిటంటే, మద్యపాననిషేధసంఘం నివేదికపై చర్చకు తప్పకుండా ఒకరోజు ప్రత్యేకిస్తాము. దానికి అనుమానం అక్కరలేదు. (Interruption తేదీని announce చేయండి. తేదీని ప్రకటించవచ్చా?)

The Hon. Sri N. SANJEEVA REDDI.— (ప్రకటించవచ్చు.) ఈ నెల 27-వ తేదీ ఒక day యిస్తామని అంటున్నారు. ఆ రోజున Ramamurty Committee Report పై చర్చ జరగగలదు. (Interruption).

Sri D. DASARATHARAMIAH — అధ్యక్షా,

Mr. SPEAKER.— Order, Order.

Sri D. DASARATHARAMIAH—On a point of information, Sir, నేను మీకు ఒక adjournment motion యిచ్చాను. దానివిషయం యేమైందని అడుగుతున్నాను.

Sri G. LATCHANNA.— అధ్యక్షా, ఈ రామమూర్తికమిటీ రిపోర్టు 27-వ తేదీ అంటే లక్ష్మీవారము పడుతోంది. అది non-official day. Government business లోకి వస్తోంది. ఇప్పుడు Assembly సమావేశంలో Non-official day ప్రత్యేకంగా వుంటేగాని, Government business అందులో కలవదు. ఈ అనధికార కార్యక్రమానికి ప్రత్యేకించబడిన రోజులను, యీలాగున వినియోగించడం ధర్మంకాదు. దానికి మేము తీవ్రమైన ఆక్షేపణ తెలుపుతున్నాము. ఈ రామమూర్తికమిటీ రిపోర్టును చర్చించడమనేది Government business. అందుచేత దానికి ప్రత్యేకంగా ఒకదినము కేటాయించాలి. అది సమంజసము. Non-official day న Government business వుండడానికి మేము యెంతమాత్రమూ అంగీకరించమని దానికి మేము object చేస్తాము. ఇది Government business కు సంబంధించినది కాబట్టి, దానిపై చర్చకు ఒక రోజు ప్రత్యేకించడం న్యాయము, ధర్మము అని చెబుతున్నాను.

27 వ తారీఖు గురువారం అవుతుంది. 28 వ non - official day ఇస్తే పరవాలేదు. లేకపోతే 26 వ యిచ్చిన పరవాలేదు. అనధికారదినం యింకొక రోజున యిచ్చినా మీరు 27 వ పెట్టుకోడానికి ఫరవాలేదు. అదీ ఇదీ కలిపి తద్దినం క్రింద చేస్తాం అంటే లాభంలేదు. (నవ్వు)

Mr. SPEAKER —వారు 27 వ ఇస్తారట.

Sri G. LATCHANNA — మళ్ళీ గురువారం ఉపయోగించమని మీరు చెప్పడం భావ్యంకాదు.

Mr. SPEAKER — నేను ఎవరినీ compel చేయలేదు.

Sri G. LATCHANNA:— మీరు ఎవరినీ compel చేయలేదు. కాని ఇంకో రోజు ఇస్తాం అని వారిని శెలవు ఇమ్మని చెపుతున్నారు.

Mr. SPEAKER — వారేదో ఇస్తాం అని చెప్పారు కదా! నా duties ఏమైనా ఉంటే చెప్పండి నేను చేయగలను.

Sri G. LATCHANNA —తమతో వాళ్ళను Compel చేయమని చెప్పడం లేదు. Non - official day ని Government business కు ఉపయోగించ డానికి వీలులేదు. అలా ఉపయోగించ డానికి వీలుకాదని మీరు వారికి చెప్పవచ్చు ఆ అధికారం మీకు ఉంది.

Mr. SPEAKER—Under rule 24 on Thursdays non - official business shall have precedence.

'Provided that on a motion made by a Member of Government for the suspension of this rule, the Assembly may resolve to transact Government business on those Thursdays which are available for non - official business under the above rule"

Therefore if they want to allot a non-official day, a motion will be made by the Leader of the House and if the House agrees, business other than non - official business will be transacted. So far as I am concerned there is nothing I can do and I cannot compel anybody to do this thing or that thing. ఆ rule ప్రకారం నేను చేయకలిగింది ఏమిలేదు.

Sri VAVILALA GOPALAKRISHNANAIAH:— ఆ తేదీనే వారు నిర్ణయించాం అని చెప్తున్నారు. వేరే non-official days ఆ వారంలోనే ఇస్తాం అని చెపితే బాగుంటుంది. లేకపోతే దాన్ని ఉపయోగించడం కష్టం అవుతుంది.

Mr. SPEAKER.— నన్ను అడగవలసింది, నేను చేయవలసింది ఏ దయినాఉంటే చేయవచ్చు కాని నేను అంతకంటె వేరే చేయవలసింది ఏమీ లేదు.

Sri M. HANUMANTHA RAO—ఇది ఒక విధమైన ప్రతిష్టంభన లాగుంది. మీ Chambers లో వివిధ పార్టీల ప్రతినిధులు సమావేశమై దీని విషయములో ఒక తేదీని నిర్ణయించడానికి ఒక ఒడంబడిక చేసుకుంటే బాగుంటుందని నా సూచన. తమరు కూడ ఆలోచించండి.

Mr. SPEAKER— మీ రందరూ ఒక ఒడంబడికకు వస్తే నా కేమీ అభ్యంతరం లేదు.

Sri V. CHIDANANDAM—Point of order, Sir. I find a Police constable within the Assembly Hall.

(laughter)

(The Police Constable who was standing at the entrance on the left of the speaker then left.)

*IV Adjournment Motion re: Closure of High Schools in Nellore Dt.*

Sri D. DASARADHARAMAIAH:-నేను ఒక Adjournment Motion ఇచ్చాను. దాన్ని నేను move చేస్తున్నాను.

That this House do adjourn for the purpose of discussing a definite matter of urgent public importance, namely, the situation arising from the closure of 12 high schools in Nellore district under the management of the District Board,

అధ్యక్షా ! నెల్లూరు జిల్లా విద్యా, వైజ్ఞానిక ఆర్థిక రంగములలో వెనుకబడి యున్నది. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆర్థిక శాఖా మాత్యులుగా ఉన్న కాలంలో వారి ప్రోత్సాహంతో నెల్లూరు జిల్లా మెట్ట తాలూకాల్లో కొంతమంది దాతల సహాయంవల్ల కొన్ని హైస్కూళ్ళు స్థాపించ బడ్డాయి. అవి ఆనాటినుంచి ఈనాటివరకు నడుస్తూన్నాయి ఈ డిస్ట్రిక్టుబోర్డులు జిల్లా కలెక్టర్ల స్వాధీనం అయిన తరవాత అవి వచ్చే విద్యా సంవత్సరం నుంచి జిల్లాలోని 12 స్కూళ్ళను మూసేస్తాం అని నోటీసు యిచ్చినారు. అవి మూసి వేస్తే జిల్లాలో షుమారు 3 వేల మంది విద్యార్థులకు ఎటువంటి విద్యానేర్చుకొనే అవకాశం లేకుండా పోతుంది. ప్రత్యేకించి రాపూరు నియోజకవర్గంలో ఉన్న 3 హైస్కూళ్ళను ఏ కారణం లేకుండా మూసి వేస్తున్నారు. యిది ప్రజాహితము కాని కార్యమని నేను నిరసించు చున్నాను.

Mr. SPEAKER — విజిటర్స్ గేలరీలో గొడవగా ఉంది దయచేసి నిశ్శబ్దంగా కూర్చుంటే బాగుంటుంది.

Sri D. DASARADHARAMAIAH — శ్రీ గోగినేని వెంకట సుబ్బయ్యగారు రాపూరు తాలూకా పెద్దాపురం హైస్కూలుకు 20 వేల రూపాయలు, 7.5 ఎకరాల స్థలం ఇచ్చారు. అదిచాలదు. మీరు ఇంకా 10 వేల రూపాయలు ఇస్తేగాని మేము రికగ్నైజు చేయుమని చెప్పారు. తతిమ్మా 10 వేల రూపాయలు కూడా ఇచ్చారు. మొత్తం 30 వేల రూపాయలూ ఇచ్చిన తరువాత దానికి రికగ్నిషన్ ఇచ్చారు. ఈ సంవత్సరం వరకూ ఆ హైస్కూలును జిల్లాబోర్డువారు నడిపారు. వచ్చే విద్యాసంవత్సరంనుంచి దాన్ని మూస్తాం అని జిల్లా స్పెషల్ ఆఫీసర్ గారు చెప్పడం చాలా అన్యాయంగా ఉంది. తరవాత జిల్లాబోర్డు ఎలిమెంటరీ స్కూలు ఆవరణలో ఉన్న పాకలకు అద్దె కట్టమని నోటీసు కూడా ఇచ్చారు. దానిమీద మేము స్థలం ఇచ్చాం. 30 వేలరూపాయలు ఇచ్చాం, 20 వేల రూపాయలమీద 2% వడ్డీ కట్టితే తిరిగి ఇంకా మాకే ఇవ్వవలసి ఉంటుంది. మేము 30 వేల రూపాయలూ ఇచ్చింది బిల్డింగ్ లు కట్టడానికి కాని ఇతరపనులకు వాడుకొనుటకుకాదు. హైస్కూలు బిల్డింగ్సు ఆ డబ్బుతో బోర్డువారు నిర్మించవలసి యున్నది. వారు ఇవ్వ

నున్న 30 వేల రూపాయలు యిచ్చి నాల్గు సంవత్సరము లయినప్పటికి, ఇంకా బోర్డువారు బిల్డింగు కట్టించక పోవుట చాలా అన్యాయము. జిల్లాలోని ఈ స్కూళ్లు మూసివేయుడంవల్ల విద్యార్థులకు చాలా ఇబ్బంది కలుగుతుంది. అటువంటి విరాళాలు ఇచ్చిన ప్రదేశంలో స్కూలు బిల్డింగులను నిర్మించడానికి వెంటనే పూనుకోవాలి. అందువల్ల ఈ విషయం చర్చించుటకు సభా కార్యక్రమమును వాయిదా వేయించమని మిమ్ములను కోరుచున్నాను.

The Hon. Sri P THIMMA REDDI :— ఈ స్కూల్సును మూసివేయడం ప్రభుత్వం యొక్క ఉద్దేశ్యం కాదు. ఆయా జిల్లాలలో ఆ యా స్కూల్సు కొరకై విరాళము లిస్తామని చెప్పిన వారంతా వారు యివ్వదలుచుకున్న విరాళాలను యింత వరకు యివ్వడం జరగలేదు అందువల్ల ఆ స్కూలుస్యొక్క పోషణ జరగడం కష్టంగా ఉంది. అందువల్ల ఈ స్కూళ్ళను District Boards మూసి వేయడం జరుగుతోంది. అంతే కాని ఈ స్కూళ్ళను మూయడం ప్రభుత్వం యొక్క ఉద్దేశ్యం కాదు. నెల్లూరు జిల్లాలోని స్కూల్సు విషయమై దశరధరామ నాయుడు, వెంకటస్వామిరెడ్డి, చెంచురామయ్య నాయుడు, గోపాల కృష్ణారెడ్డిగార్లు నాతో చెప్పారు. ఆ ప్రాంతంలో విరాళా లిస్తామని చెప్పి డబ్బు యివ్వదలచుకున్న వారు డబ్బుయివ్వక, చాలా భవనములను యిస్తామన్న వారు భవనములను యివ్వ నందువల్ల ఆ స్కూళ్ళను నడపడానికి చాలా యిబ్బందిగా ఉంది. అందుచేత ఆ యా ప్రాంతాలలో వారు ఆ యా విరాళాలను వసూలు చేయాలని నేను వారిని కోరుతున్నాను. మీరు కూడా కొంచెం సహకరించాలి. ఆ యా ప్రాంతముల సభ్యులు అచ్చట విరాళాలిస్తామని చెప్పిన వారివద్దనుంచి వసూలు చేయుటంలో కొంచెం సహకరించాలి. అప్పుడు ఈ స్కూళ్ళను మూయవలసిన అవసరమే ఉండదు.

An hon. MEMBER :— ఇది అన్ని జిల్లాలకు వర్తిస్తుందా, ఒక నెల్లూరు జిల్లాకేనా.

The Hon. Sri P. THIMMA REDDI :- మొత్తం అన్ని జిల్లాలకూ నండీ.

Mr. SPEAKER — In view of the statement made by the Hon. Minister, no further action is necessary. The motion is disallowed

*V. Censure Motion on the Minister*

Sri T. NAGI REDDI — అధ్యక్షా ! నేను యిచ్చిన తీర్మానము విషయమై ఈ నాడు ప్రభుత్వం ఒక దినము కేటాయిస్తామని చేసిన statement కు, తాత్కాలికంగా, దానిని ఆలోచనలో పెట్టుకొని తిరిగి దానిని గురించి తిరిగి నేను పునరాలోచించు కోడానికి, అవకాశం యివ్వాలి. మేము దీనిని గురించి తిరిగి ఆలోచించు కుంటాము. ఈ లోపల గవర్నమెంటు వారు కూడా పునరాలోచించు కుంటారు. దీనినిగురించి వారు ప్రత్యేకంగా ఒకరోజు అవకాశం యిస్తున్నామని అన్నారు. అందువల్ల దీనిని యిపుడు తీసుకు రానవసరం లేదని నేను చెప్తున్నాను. వారు 27 వ తేదీని ప్రత్యేకముగా యిచ్చామంటున్నారు కదా ?

Mr SPEAKER — I will adjourn it sine die. You will give notice of moving it when necessary; and the motion will be there.

Sri T. NAGI REDDI — All right. Thanks.

## VI BILLS

*The Andhra University (Andhra Amendment) Bill, 1954*

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— నాది ఒక Point of order ఉంది నిన్నను non-official Bill లో Andhra University (Amendment) Bill వచ్చినప్పుడు విశ్వనాధంగారు ఒకటి సెలవిచ్చారు. ఒక బిల్లును మొట్టమొదట శాసన సభలో ప్రవేశపెట్టిన తరువాత ఇంకొక బిల్లును ఇక్కడ ప్రవేశపెట్టకూడదని, Government Bill Introduce అయినప్పుడు దానికి సంబంధించిన non-official Bill యిక్కడ ఈ శాసనసభలో రాడానికి అవకాశం లేదని చెప్పారు. దీనిమీద మీరు రేపు ఈ Bill

introducing గురించి ruling యిస్తామని అన్నారు. అయితే దీనిలో ఒక సమస్య వచ్చింది. విశ్వనాథంగారి contention accept చేసేటట్లైతే ఈ రోజున ఈ University Bill ను చర్చించడానికి వీలు లేదు. ఎందుకల్లనంటే, ఏ Bill ముందుగా వచ్చింది? ఏ బిల్లును ముందుగా ఈ House లో introduce చేయాలి? అనేది ఇప్పుడు సరిగా తెలుపవలసింది. ఏ బిల్లు ఇపుడు ముందుగా వచ్చింది? ఒక Bill ను ముందుగా House ముందుకు తీసుకు వచ్చినతరువాత ఇంక ఏ ఇతరబిల్లును, అదే విషయానికి సంబంధించిన Bill ను తీసుకు రాకూడదని విశ్వనాథంగారి contention. అయితే నాబిల్లును 27-2-54 వ తేదీన Assembly Office కి నోటీస్ యిచ్చియుంపాను. ఆ తరువాత Assembly adjourn అయింది. Assembly adjourn అయినరోజు బుధవారం, ఆ మరుసటిరోజే గురువారం, non-official day అయింది. అందుకే గురువారం నాన్ అఫిషి యల్ బిల్లు రాకుండా వుండడానికి బుధవారం వాయిదా వేశారు. అందుచేత ఈ బిల్లును ఈ రోజున ఈ సభముందుకు తీసుకురావలసిన గత్యంతరం ఉందని నేను చెప్తున్నాను. అన్ని బిల్లులకు ముందుగా Assembly Secretariat లో నేను motion యిచ్చాను. అన్నిటి కన్న ముందుగా Assembly Secretariat చేరింది. దాని విషయమై నేను మరల Assembly Office కి వ్రాశాను. అప్పుడువారు, గవర్నర్ Permission కావాలని నాకు వ్రాశారు. నేను గవర్నరును April 12 వ తారీఖున రికమండేషన్ అడిగాను. తరువాత గవ ర్నర్ గారికి వ్రాశాను. దానిపై గవర్నర్ Secretariat వారు ఏమని వ్రాశారంటే,

I am advised by the Governor that it is not necessary that the Governo rrecommend the introduction of the Andhra University (Andhra Amendment) Bill, 1954. I may also add that he should give such recommendation only after the introduction stage of the Bill, i. e. after the House has given leave to introduce the Bill.

అందువల్ల priority ప్రకారం చూసినా సరే ముందుగా నా బిల్లు House ముందుకు వచ్చితీరాలి. అసలు priority question వచ్చిందంటే నా బిల్లు మొట్టమొదట వచ్చితీరుతుంది. అది గవర్నమెంట్ Bill అయినా సరే, non-official Bill అయినాసరే priority ప్రకారం House ముందుకు తీసుకురావాలి. Priority విషయంలో గవర్నమెంట్ Bill అని Non official Bill అని ఉండదు. అందువల్ల విశ్వనాథంగారి contradiction statement అంగీకరిస్తే దాని ప్రకారం దీనిని ఇప్పుడు move చేయడానికి వీలులేదు అంటే నా బిల్లు priority ప్రకారం ముందు నిలుస్తుంది. నా ఆంధ్ర విశ్వకళా పరిషత్ సవరణబిల్లు ముందు stand అవుతుందని నేను మీకు మనవి చేస్తున్నాను.

The Hon Sri T. VISWANATHAM:— గోపాల క్రిష్ణయ్య గారు చెప్పిన దానిలో ఒక పొరపాటు ఉంది. ఏ Bill ను Introduce చేయవలసి వచ్చినా అది గవర్నమెంట్ Bill అయినట్లైతే Assembly rules ప్రకారం దానికి preference ఉంటుంది. దానిని priority ప్రకారం కాకుండానే introduce చేయవచ్చును. ఇంకేదైనా non-official Bills ఉంటే దానికి amendments రూపంలో తీసుకురావచ్చు. అంతే కాని ఒక Bill House ముందున్నప్పుడు ఆ విషయానికే సంబంధించిన ఇంకొక non-official Bill ను ప్రవేశపెట్టడానికి ఏ 'లా' ప్రకారం కూడా వీలులేదు. ఏ ఎసెంబ్లీ కార్యక్రమంలోనూ అది ఉండదు. ఆయన Bill కు priority ఉంది కాని preference మాత్రం గవర్నమెంట్ Bill కి ఉంటుంది ఈ University Bill విషయంలో మీరు యీ బిల్లును, యీ Government Bill కు amendement రూపంలో యివ్వవచ్చును. ఈ గవర్నమెంటు Bill కు preference ఉండడంవల్ల ఆయన Bill ను cancel చేయడం జరిగింది. ఈ Government Bill publish అయినది. ఇంక ఈ విషయంలో ఏ non official బిల్లు కూడా రావడానికి వీలు లేదు. అందుచేత ఈ గవర్నమెంట్ Bill ను ఇక్కడ ఇప్పుడు

తీసుకురావచ్చును అని నేను చెప్తున్నాను. Introduction లోకి వచ్చినపుడు Which cannot be introduced or moved save with the previous sanction of the authority which has the power to grant the previous sanction అని చెప్పి 75 వ క్లాజులో వుంది. అసలు బిల్లును అయినా House లో చర్చించడానికి consideration లోకి వచ్చినపుడు ఈ బిల్లుకు, ఆ బిల్లుకు ఏవిధమైనటువంటి సంబంధం వుంది? ఏవిధమైన తేడా ఉంది? ఈ బిల్లును move చేసేటప్పుడు అసలు priority ప్రకారమే చేయాలి. నేను నా బిల్లు విషయమై Assembly office ను అడగ్గా దాని విషయమై గవర్నర్ గారిని పర్మిషన్ అడగాలని చెప్పి వ్రాశారు. అసలు ఈ బిల్లును introduce చేసినపుడు priority ప్రకారం move చేయడానికి అవకాశం యివ్వాలి గవర్నర్ గారి దగ్గరనుంచి వచ్చిన Memorandum లో ఎలా వుంది అంటే గవర్నమెంట్ Bill లేనప్పుడు అసలు ఈ బిల్లును priority basis మీద move చేయవచ్చును. అందులో ఎలాగున్నదంటే leave to introduce this Bill అని వున్నది. ఈ బిల్లును priority ప్రకారం allow చేయాలని, ఇది సాధారణంగా అన్ని Assemblies లోను జరుగుతున్నది. అందుచేత దీనిని మీరు allow చేయాలని కోరుతున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAIAH — 'If any question arises whether a Bill or amendment is or is not a Bill or amendment which cannot be introduced or moved save with previous sanction the question shall be referred to the authority which whould have power to grant the previous sanction if it were necessary, and the decision of that authority on the question shall be final.'

If the motion for leave to introduce a Bill is opposed, the Speaker, after permitting, if he thinks fit, a brief explanatory statement from the member who moves and from a member who opposes the

motion, may, without further debate, put the question thereon.

If such a motion is agreed to, the Bill shall be deemed to have been introduced.

Sri R. LAKSHMINARASIMHAM DORA — Sir, just a word in support of the motion of Sri Vavilala Gopalakrishnaiah. Now. it is not a Bill that is introduced. It is a motion seeking leave to introduce a Bill. We have not yet come to the stage of introducing a Bill in the House. So Sri Gopalakrishnaiah seeking leave of the House to introduce his Bill is only a motion to obtain the leave of the House to introduce his Bill. So we shall not have to consider at this stage what the Law Minister said, whether the Bill offences the rule of anticipation. Sri Gopalakrishnaiah's motion may be placed before the House and if the House grants him leave, then the question of dealing the Bill on its merits, whether it offends a law already in vogue or offends any Bill which has already been before the House, arises So, now, Sri Gopalakrishnaiah may be given leave to introduce his Bill. Further this Bill should not be considered as offending the rule of anticipation. The Bill before the House is for the establishment of Sri Venkateswara University. Sri Gopalakrishnaiah's Bill may be a complementary Bill to that Bill There is nothing to say that all the provisions of that Bill will be accepted, i. e. that the new University will be a residential University and an affiliating University. Supposing the provisions of affiliation are not accepted, then, such provisions in Gopalakrishnaiah's Bill will become void. In any view of the matter, leave to introduce his Bill may be granted. Moreover, the rule of anticipation would not come in the way at all. For the rule contemplates it only with respect to a Bill which has already been passed. Under rule 74, when notice of a motion for asking leave of the House to introduce a Bill has been given to the

Speaker, the Speaker's duty is, unless it requires the previous sanction of the Governor, to place it before the House, to ask it whether leave can be given.

Mr. SPEAKER —All this aspect will be considered when this Bill comes up on the next non-official day, on the 20th instant.

*The Sri Venkateswara University Bill, 1954.*

Sri PILLALAMARRI VENKATESWARLU .—నా Amendment move చేయమంటారా ? I move—

This House do hebeby instruct the Select Committee to amend the Bill in such a way so as to establish and incorporate only a residential and teaching University (and not affiliating University) in Tirumalai-Tirupati area.

Mr. SPEAKER — Can he move this amendment before the select committee ?

The Hon. Sri T. VISWANATHAM — He can certainly move it. నేను మనవిచేసే దేమిటంటే there is no bar. సెలెక్టు కమిటీలోకి రావలసిన amendments ఒక instruction గా యివ్వడం పొరపాటని మనవి చేస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU ;—విశ్వనాధంగారు చాల simple గా తేల్చిచెప్పారు. కాని కొన్ని విషయాలు మీా దృష్టికి తీసుకు రాదలచాను. May's Parliamentary Practice 517 పేజీలో ప్రత్యేకంగా యివ్వబడింది. Definite course of action గురించి instructions యివ్వవచ్చునని వుంది. Difinite గా యీా విధంగా వుండాలని mandatory instructions యివ్వవచ్చు. ఖచ్చితంగా యీా విధంగా వుండాలని House తేల్చుకున్నప్పుడు instructions యివ్వడానికి వీలున్నది. మీారు చదువుకుంటారా ? నన్ను చెప్పమంటారా ?

Mr. SPEAKER :— ఏ పేజీ అన్నారు ?

14th May 1954]

Sri PILLALAMARRI VENKATESWARLU :— 517 వ పేజీ కమిటీకి mandatory instructions యివ్వవచ్చు. Instructions ఎలాంటి పరిస్థితులలో యివ్వవచ్చునో 517 వ పేజీలో వివరించబడి ఉన్నది.

May's Parliamentary Practice page 517 An instruction may be given the purpose of which is either to empower the committee to be something which it could not otherwise be, or to define the course of action which it must follow. The first type of instruction is called permissive, the second mandatory. A mandatory insturction, however, may be given to a select committee or to a committee on a private Bill.

Title of the Bill ను మార్చేవిధంగా instructions యిచ్చి పంప వచ్చునని దీంట్లో ఖచ్చితంగా చెప్పబడింది. I request you to read it for yourself. Origin of instruction క్రింద రాస్తారు.

Again, further down in the same page of May's Parliamentary Practice, it is said as follows :—

"Again on page 96, the author states that' if it be proposed to insert in the bill any new or additional matter foreign to the bill, or not within the scope of its title, or to leave out of the bill any subject matter expressed in its title, the committee must be expressly empowered to make provisions for all such purposes by previous instructions from the House.

Occasions, however, continue to arise, though perhaps more rarely, when it is desired to propose amendments in committee of wider scope than those contemplated in the standing order, which the committee could not consider without a special instruction from the House empowering them to do so. Some classification therefore, is attempted.

The whole Bill has to go before the select committee, this House should function as a select com-

mittee under your presence. So there is great difficulty in discharging the duties.

Mr. SPEAKER — ఈ క్రింది పేరాలో వున్నదికూడా చదవండి.

Sri PILLALAMARRI VENKATESWARLU — I will take you from point to point. Title of the bill ఏమి చెబుతున్నది. Residential, Teaching and affiliating University అని వున్నది. నా instructions లో నేను చెబుతున్నది యేమిటంటే "affiliating" అనేది తీసివేయాలని ఖచ్చితంగా చెబుతున్నాను. ఆ విధంగా instructions యివ్వాల్సిన అవసరం వున్నది. తదనుగుణంగా మిగతా clauses మారుతాయి. Titile of the bill మార్చడానికి instructions యివ్వవచ్చు

Mr. SPEAKER —You can arrive at the conclusion by a different process. I would like you to consider this point. This amendment can be brought before the select committee. Supposing, in the select committee, as you suggest, it is possible that the members representing this shade of opinion are in a minority, then, the select committee may not accept the amendment. None the less, this amendment can be brought before the House. Then the House can consider it and say that it would accept the amendment; we want to see that the University dees not become an affiliating university Even then, the House is master of the situation.

Sri PILLALAMARRI VENKATESWARLU — బిల్లు తాలూకు Scope widen చేయాలంటే మీరు చెప్పిన సూచన సరిపోతుంది. నేనుచెప్పేది అదికాదు. Title of the Bill లోనుండి ఒక మాటను తొలగించడానికి యిచ్చే instructions నేను చెప్పేది. మీరు చెప్పేది widening of the title కు సరిపోతుంది. ఇది widen question కాదు. Affiliate కాకూడదు అని specific instructions యివ్వాల్సిన అవసరంవున్నది కనుక నేను తీర్మానం తీసుకు రావడం జరిగింది, 518 పేజీలో క్రింది పేరా చూడండి,

Affiliated అనేదిలేకుండా తీసివేయాలని చెప్పినపుడు instruc-tions యియ్యాలి. లేకపోతే Select Committee లో అవకాశం లేదు. Affiliated అనే మాట తో కూడ as it is గా పోతుంది. Select Committee House లో majority opinion reflect చేస్తుంది అని presume చేసుకో నక్కరలేదు. కమిటీ opinion House ముందుకు చర్చకు వస్తుంది. Affiliating, Teaching and Residential అనే basis మీద resolution ముందు amendment pass అవుతుంది. Then this Bill must be again forwarded to a Select Committee.

అందువల్ల మనం working point of view యీ విషయంలో ముందు తేల్చుకుంటే మంచిది. Select Committee లో move చేయడానికి అవకాశం వున్నదని చెబుతున్నారు. Mandatory instructions పంపిస్తే House opinion తేల్చుకోడం మంచిదికదా. ఇది technical side కాదు. Techincal side is favourable to me.

Mr. SPEAEKR — The same amendment can be raised before the House? Is it not so?

Sri PILLALAMARRI VENKATESWARLU.— అది సరేననుకోండి. You are going to the third stage of the bill. నేను చెప్పేది అది కాదండి.

Mr. SPEAKER.— The House Consider it; it can say, we will accept the amendment, or, we will reject. What the committee accepted, cannot the House do it? ఇప్పుడు యీ బిల్లు సెలెక్టు కమిటీకి పోతుంది. ఈ amendment ను మీరు అక్కడే తీసుకురావచ్చు. Affiliate కాకుండా వుండాలని మీరు select committee లో అనవచ్చు. అది వీగిపోతుంది. వీగిపోయిన తరువాత the same point can be raised before the House, అవునా ?

Sri PILLALAMARRI VENKATESWARLU.— Yes. I want the House to give a mandate to the select committee.

Mr. SPEAKER.— Please finish in two or three minutes.

Sri PILLALAMARRI VENKATESWARLU.— It is not a matter which can be finished so soon.

Mr SPEAKER — There is another amendment of yours. The question is, whether the motion can be admitted or not,

Sri PILLALAMARRI VENKATESWARLU.— The benefit of doubt must be given to me.

అసలు mandate ఇచ్చుటకు provision ఉన్నదా లేదా. Mandate ఇవ్వనక్కర్లేదనుకుంటే it is for the House to reject the motion. Next stage లో తీసుకురావచ్చునా లేదా అనే point తీసుకువస్తున్నాను. Next stage లో తీసుకువచ్చుటకు అనేక ఉదాహరణ లున్నవి. Select Committee function చేయుటకు House opinion express చేయవచ్చును. Select Committee పనిచేయుటకే నేను ఈ motion తీసుకువచ్చాను. Rules లో యున్నది. Practice లో కూడా తెలుస్తోంది. House ముందు amendment stand అవుతుందా కాదా. Whether there is ground for admission అని ఒక point express చేయుటకు అవకాశం ఉంది. Benifit of doubt is on my side. Parliamentary practice చూసుకుంటే ఖచ్చితంగా కనిపించుతోంది. 522 వ పేజీ చూడండి, దాన్ని చూస్తే mandatory గా యుంటే disallow చెయ్యాలని చెప్పారు. S. O. No. 40 ని ఆధారంగా చేసుకుని విశ్వనాథంగారు మాట్లాడారు. అది superfluous అని చెబుతున్నారు. The purpose of an instruction is to empower the committee to do something. I request you to give a directon to the Select committee.

Select Committee లో House అంతా ఉండదు. Few selected Members ఉంటారు. ఖచ్చితమైన mandate

ఇచ్చి వారు ఈ విధంగా చేయాలనే మోస్తరుగా amendment ఉన్నది. ఇది అవసరమా లేదా అని decide చేయవలసి యున్నది. మీరు ఇది దృష్టిలో పెట్టుకొని ruling ఇవ్వమని కోరుతూ యున్నాను. మన లైబ్రరీలో పుస్తకాలు లేకపోవడంవల్ల ఖచ్చితమైన example ఇవ్వ లేక పోతున్నాను. ఈ విషయంలో House opinion తెలుసు కొనుటకు అవసరం ఉన్నది. ఇది consider చేసి ruling ఇవ్వ మని కోరుతున్నాను. Reasoned amendment ఇచ్చుటకు కారణం ఇది ఒక stage లో వచ్చేటప్పటికి ఈ పద్ధతిలో పెద్దలు restrict చేస్తూ ఇచ్చేది reasoned amendment.

Mr. SPEAKER — ఏమిటో మాట్లాడారు ఏది reasoned amendement ఒక్కసారి చదవండి.

Sri PILLAMARRI VENKATESWARLU .— My amendment is

That it is necessary to establish and incorporate a residential and teaching University (and not an affiliating University in Tirumalai - Tirupati area in the Chittoor district for the encouragement of higher education and research in all branches of learning.

ఇది reasoned amendment. ఇది move చేయుటకు అవకాశం ఉంది. ఇది pass చేసినా House యొక్క opinion express అవుతుంది.

Mr. SPEAKER —రెండు amendment లకు తేడా ఏముంది.

Sri PILLALAMARRI VENKATESWARLU :— wording is all most same.

Mr. SPEAKER — A reasoned amendment is one which is in the nature of a dilatory motion. It gives reasons which are totally opposed to the original policy. Here, you want to eliminate one portion and put something else in its place. House of Commons లో practice ఉన్నది.

Sri PILLALAMARRI VENKATESWARLU .— 507 వ పేజీలో reasoned amendment గురించి చెప్పి ఉంది.

P 507. May's Parliamentary Practice Reasoned amendment

It is also competent for a Member who desires to place on record any special reasons for not agreeing to the second reading of a bill, to move what is known as a 'reasoned amerdment'. This amendment is to leave out all the words in the main question after the word That' and to add other words, and the question proposed upon the amendment is, that the words proposed to be left out stand part of the question.

It may be declratory of some principle adverse to, or differing from, the principles, policy or provisions of the Bill It may express opinions as to any circumstances connected with the introduction or prosecution of the bill, otherwise opposed to its progress.

అంతేగాని Reasoned amendment ను పెట్టినంతమాత్రాన అది opposed to the progress of the bill అని అనుకోవడం సరి కాదు. రెండవది dilatory tact cs క్రింద తీసికొనిరావచ్చును. అప్పుడు మీరు దానిని త్రోసివేయవచ్చును. My amendment says "That it is necessary to establish and incorporate - Residential and teachiing University" etc. అలా ఇది progress ను hinder చేసేటట్లైతే మీరు త్రోసివేయవచ్చును. ముందుగానే expedite చేయుటకు దీనిని మేము తీసికొని వచ్చాము. అందువల్ల దీనిని dilatory tactics క్రింద అనుకోవడం పొరపాటు. దీని మీదనే

P. 538 of May's Parliamentary practice.

*Effect of carrying a 'Reasoned Amendment.'.*

According to modern practice, it would appear to be unlikely that, after a reasoned amendment had been carried on the second or third reading of a bill, any further progress would be made. If it is merely desired

to draw attention to a matter incidental to the legislation intended by the bill, or to affirm a principle which could be incorporated in the bill at a later stage, this purpose could probably be better effected by an instruction or an amendment moved in the committee.

It must be borne in mind, however, that the amendment, if agreed to, does not necessarily arrest the progress of the bill, the second reading of which may be moved on another occasion.

Mr. SPEAKER.—506 పేజీలో clear గా వుంది. ఈ వేళ కాకుంటే రేపు move చేయవచ్చును. కాఫీ త్రాగివచ్చిన తరువాత move చేయవచ్చును. Reasoned amendment progress ను arrest చేయవద్దు. అందువల్ల దీనిని సెలెక్టు కమిటీకి mandate గ ఇచ్చి పంపవలెను. ఖచ్చితమైన అభిప్రాయాలతో సెలక్టు కమిటీకి పోయినప్పుడే అచ్చట జయప్రదముగ జరుగుతుంది. అందుకోసం దీనిని తీసుకొని వస్తున్నాను. లేక పోయేటట్లైతే సెలక్టు కమిటీతో కూర్చుంటే కష్టం. మంత్రి పట్టాభిరామా రావుగారికి మెజారిటీవుంటే సెలక్టు కమిటీ ఏమి అవుతుంది. అనేక ప్రధానమైన మార్పులు చేయవలసి వచ్చినపుడు House అంతా చేయవలసి ఉంటుంది. Affiliating దృష్టిలో పెట్టుకొని చేస్తుంది. అది కాదంటే Residential. So direction should be given to the Select Committee to establish only a Residential and Teaching University. అప్పుడే బిల్లు పూర్తి చేయ గలుగుతాము. అందువల్ల దీనిని దృష్టిలో పెట్టుకొని మన House opinion ను తీసుకొని తీరవలెను. దీర్ఘదృష్టిలో పెట్టుకొని దీనిని తీసుకొని వచ్చి పెట్టాము. Reasoned amendment గ అయినా ఇవ్వవచ్చును. Instruction to the కమిటీగా అయినా ఇవ్వవచ్చు. ఏ పద్ధతిలో admit చేసినా మాకు అభ్యంతరములేదు. దీనికి మీరు రూలింగు ఇవ్వవలెనని కోరుతున్నాను.

Mr. SPEAKER — The words of both the amendments and the spirit underlying them are the same. Therefore I treat it first as an instruction to the select committee. Our rules make provision for the giving of instruction to the select committee and that rule is 89. It runs thus:

'89. It shall be an instruction to every Select Committee on a Bill that it has power to make such amendments therein as it shall think fit, provided that such amendments are relevant to the subject matter of the Bill.'

Therefore, there is an omnibus or general instruction provided by the rule itself to the select committee that all amendments which are relevant to the subject matter of the bill can be raised in the select committee. Supposing an amendment is carried in the select committee, it would not be necessary for the matter to be brought before the House. For the sake of argument, let us suppose, that the amendment is not carried in the select committee, then, it can be brought before the House and the House can accept or reject it. Thus this House is master of the situation. So at this stage, in view of Rule 89 I think, it is not necessary.... I am not saying, it is inadmissible .... this amendment should go before the select committee.

Sri PILLALAMARRI VENKATESWARLU — If you say, it is inadmissible ................

Mr. SPEAKER.— I can only say, whether it is necessary or not, For the rule provides for every contingency. So I rule out at this stage. It is open to us to consider it once again, if you so wish to bring it before the House.

Sri C. V. K. RAO— అధ్యక్షా. వెంకటేశ్వర యూనివర్శిటీ బిల్లును మంత్రిగారు సెలక్టుకమిటీకి పంపించాలని కోరుతూ. యిక్కడ ఒక motion తెచ్చారు. దీనిమీద మాట్లాడుతూ రెండవ యూనివర్శిటి అవసరమనీ - యీ రెండవ యూనివర్శిటీ ఏర్పాడాలనీ చాలా సంవత్సరాల బట్టి కోరుతూవుంది. అందుచేత, ఈ బిల్లును తీసుకొని వస్తున్నామని చెప్పారు. రెండవ యూనివర్శిటీ ఏర్పడేటప్పుడు ఆ యూనివర్శిటీ ఏ విధంగా వుండాలి, దాని Functions ఎల్లా వుండాలి అన్న విషయాలకు స్పష్టమైన అభిప్రాయం చెప్పలేదు. వారి దృక్పధాన్ని బట్టి వీలయితే, ఎఫిలియేటింగ్ యూనివర్శిటీగా వుండాలనీ లేకపోతే -

రెసిడెన్షియల్ యూనివర్శిటీగా వుండాలని చెప్పారు. ఈ బిల్లులో యింకో విషయం వుంది.

Mr. SPEAKER — I am allowing 10 minutes only for each member.

Sri C. V. K. RAO — ఈ బిల్లులో ప్రత్యేకంగా, నెల్లూరులో ఈ రెండవ యూనివర్శిటీ చేర్చాలనీ - ఆంధ్ర యూనివర్శిటీనుంచి విడదీసి చేర్చాలనే భాగము కూడవుంది. అసలు యూనివర్శిటీ యొక్క వుద్దేశ్యాలు ఏమిటి ? ప్రత్యేకంగా విద్యను ఆ ప్రాంతములో నేర్పడానికి ఆ ప్రాంతములోని ఉపాధ్యాయులకు వృత్తిని కల్పింప చేయడానికే. అక్కడ కొన్ని నిర్మాణ సూత్రాలద్వారా విద్యను అభివృద్ధి చేయటానికి, యూనివర్శిటీ ఏర్పడుతుంది. ఇప్పుడు యూనివర్శిటీలు చాలా పాత పంథాలో నడుస్తున్నవి. విద్యా ప్రాముఖ్యమును బాగా గుర్తించుచున్నట్లులేదు. ఆంధ్ర ప్రభుత్వం ఏర్పడిన మీదట, వివిధ ఆశయాలతో కూడినటువంటి - విశ్వవిద్యాలయమును ఏర్పర్చాలనే దృక్పథం, యీ ప్రభుత్వమునకు వున్నట్లు తోచదు. సంకుచిత ధోరణి బలపర్చే - ప్రాంతీయ అభిమానమును తృప్తిపరచే పద్ధతిని అవలంభిస్తున్నది. విషనరీ విషయములో కూడా. ఆ పంథానే జరుగుతున్నది. విద్యా విషయంలో యూనివర్సిటీని ఏర్పాటు చేసే సందర్భంలో ఒక శాస్త్రీయ పద్ధతిని దేశ అవసరాలను గుర్తించటంలేదు. ఈ బిల్లును ఏ పంథాలో ప్రవేశపెట్టుతున్నదీ విద్యాశాఖా మంత్రిగారు మాట్లాడిన ధోరణిలో స్పష్టము అవుతుంది. ఆ ధోరణిలోనే దానిని ఏర్పాటు చేశారు. ఇందులో మంత్రివారిని కమిటీ వుద్యోగులుగా ఏర్పాటు చేశారు. వారు గాకుండా ఇతర వుద్యోగులను, ప్రత్యేకంగా కృషి చేసిన వారిని నియమించడానికి అవకాశం కలుగచేస్తే బాగుండేది. ఈ కమిటీలో వేసినవారు సమర్థులైన వారు కారని నేను అనటంలేదు. మంత్రివర్గము వారిచే ఏర్పాటు చేసిన కమిటీకి, స్వేచ్ఛ అరికట్టబడుతుంది ఆ కమిటీవారి రిపోర్టుచూస్తే అందులో గూఢమైన అర్థము వున్నది. దానికి నీరు సదుపాయము లేదని చెప్పారు. సరియైన వాతావరణము సృష్టించడానికి వరుని దేవుని సెలవు కావలసినట్లుగా వుంది. యూనివర్శిటీకి ప్రత్యేక Funds లేకపోతే - ఇది నిర్మించటానికి వీలులేదని చెప్పారు. ప్రారంభములోనే యూనివర్శిటీకి సరిగా Funds ఏర్పాటైవుంటే - దానిని అభివృద్ధి చేయుటానికి అవకాశం

వుంటుంది. లేకపోతే దానికి బాధ్యులు ఏరే అని చెప్పాలి. Funds ను ఎక్కువ చేసుకునేటట్లు ముందు పూనుకోవాలి. టెక్నిషియన్ staff విషయం చూస్తే చాలా లోపముగా వుందని - ఆ రిపోర్టులో చెప్పబడి వుంది. ముందు ఇంటర్ మీడియెట్ కోర్సులు ముందు ఏర్పాటుచేస్తే చాలా లాభంగా వుంటుందని ఆ రిపోర్టులో చెప్పబడింది. 5 వ రికమెండేషన్ చూస్తే యీ విధంగా ఉన్నది.

As the University cannot undertake direct teaching for the Intermediate Course, two Intermediate colleges for men and women should be temporarily established at Tirupati.

కనుక, ఒక్క యింటర్ మీడియెట్ కోర్సులు ఏర్పాటు చేయటానికి అవకాశంలేనప్పుడు ఉన్నత విద్యను ప్రారంభించడానికి ఎటువంటి అవకాశం వుంటుందో అనుమానంగానే వున్నది. ఇంకా యీ విధంగా అనేకమైన ఆటంకాలు వున్నవి. 12 వ అంశంలో చెప్పింది ఏమంటే,

Before students are admitted to a course in the University, the staff, buildings and equipment necessary for it should be available.

కనుక ఒకమాటలో చెప్పాలంటే, యీ సూచనలలో చూస్తే ఎటువంటి అవకాశాలు సదుపాయాలు వున్నట్లుగా కనుపించటంలేదు. ప్రాంతీయ కోరికలను సంతృప్తిపరచడానికే యీ వెంకటేశ్వర యూనివర్శిటీని తలపెట్టినట్లుగా తోస్తున్నది. ఈ విధంగా ఉన్నత విద్యా విషయమై పూనుకొనుట సాధ్యంకాదు, దేశములో ఎక్కువ యూనివర్శిటీలు వుండటం అవసరమే. ఈ ప్రభుత్వం ఎక్కువ యూనివర్శిటీలకు అవకాశం కల్పించవలసినదే దానికి తగిన వ్యవధి తీసుకొని ఉన్నత విద్యను నెలకొల్పడానికి - తగినవారిని తయారుచేసి, ఆర్థికంగా కూడ దేశాన్ని అభివృద్ధిపర్చే పరిస్థితులను ఏర్పాటుచేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. అటువంటివి లేనప్పుడు వేరొక ప్రాంతములో అఫిలియేటింగ్ యూనివర్శిటీని పెట్టటం అంటూ జరిగితే, అది తొందరపాటుతో కూడిన సాహసకార్యమే అవుతుంది. ఈపంథాను అవలంభిస్తే ఇందువల్ల చాలా నష్టాలు వాటిల్లుతాయని చెప్పవలసి వుంటుంది.

ఇప్పుడు ఈ కొత్త University ని ఏర్పరచాలని పూనుకొన్నప్పుడు, దరిదాపు ఒక కోటి, 50 లక్షల రూపాయలైనా ఖర్చుపెట్టాలి. ఒక కోటి, 50 లక్షల రూపాయలు ఖర్చుపెట్టినప్పటికి, ఎక్కువమందికి విద్య గరిపే విధానానికి ఇదేమి ఉపయోగపడదు. ఇక ఉన్నత విద్యను పోత్సాహించుటకు గూడ ఇది ఉపయోగపడదు. బిల్డింగులకు, ఉద్యోగులకు, కనీస staff కు, వీటిని నిర్మించడానికి ఇంత డబ్బు వినియోగ పెట్టినాగాని, దేశములో ఉన్నత విద్యను ప్రోత్సహించడానికి తగినటువంటి అవకాశము కలిగించినట్లుకాదు. కనుక నిజంగా ఈ ప్రభుత్వానికి ఈ రాష్ట్రములో, ఉన్నత విద్యను ప్రోత్సహించాలనే అభిప్రాయం ఉండినట్లైతే తిరుపతి ప్రాంతములో ఉన్నటువంటి విద్యాలయాలను ఒక Residential University గా పెట్టడంద్వారా ప్రత్యేకముగా అవకాశము ఉంటుంది. ఈ సందర్భమున మంత్రిగారు ఒక విషయాన్ని చెప్పారు. ఆంధ్ర యూనివర్సిటీలో ఎక్కువమంది విద్యార్థులున్నారు. కనుక ఈ విద్యార్థులను ఈ విద్యాలయాలన్నిటినీ, ఒక University contorl చేయడం కష్టమని అన్నారు. అట్లైతే మద్రాసు యూనివర్సిటీ తీసుకోండి మద్రాసువారు ఇచ్చినటువంటి లెక్కలు చూచినట్లైతే, అవి పాతలెక్కలే అనుకోండి, వాటిప్రకారం 28 లక్షల విద్యార్థులు అక్కడ ఉన్నారు. 28 లక్షలమంది విద్యార్థులకు అక్కడ ఉన్నటువంటిది ఒకే ఒక University యే. వేరొక Residential University, Annamalai University ఉన్నది. ఆవిధంగా ఒక experiment జరుగుతూ యున్నది. మన ఆంధ్ర రాష్ట్రానికి ప్రత్యేకంగా ఒక ప్రాంతముయొక్క కోరికను తీర్చదలచినట్లైతే ఒక Residential University ని పెట్టడంవల్ల విద్యాభివృద్ధి చేయడానికి అవకాశాలుంటాయి. Senate కూడా ఇదే అభిప్రాయాన్ని తెలియపరచింది. ఇక ఆంధ్ర యూనివర్సిటీలో ఉన్నటువంటి Affiliating Colleges అన్నీ చీల్చివేయడం సరియైనటువంటిది కాదు. దానియొక్క అభివృద్ధికి చాలా నష్టము కలుగుతుంది. అందుచేత నెల్లూరును విడదీయడం సవ్యంకాదు. ఈ అభిప్రాయాన్ని ఆంధ్ర యూనివర్సిటీ Senate కూడ వ్యక్తపరచింది. కనుక ఈ బిల్లులోని అంశములను చాలా జాగ్రత్తగా ఆలోచించి అవలంబించవలసిందని మంత్రిగారిని, ప్రభుత్వమును కోరుతున్నాను.

Sri P. V. R GAJAPATHI RAJU :— Mr. Speaker, Sir, regarding the University Bill, I am afraid, that, as usual, the problem has been converging into an aspect of the regional struggle, which has been going on in our State since the last six months. That pattern it has already taken, to some extent Therefore, it is with some amount of delicacy that I have to talk, as it is liable that we might get misinterpreted as saying things to suit the locality or the area one comes from.

The necessity for a second University is always there, and would be there. We feel, we have discussed it carefully in our party. We have tried to follow the discussion in the Assembly here, the other day. We have gone through all the reports presented and we feel that the best solution at this juncture wouldbe the formation of an university at Tirupati, the question of affiliation being taken only after two or three years after the University has started functioning. We are unable to put this point of view effectively, for the Opposition has become very noisy and categorical, in a large extent. Sri P Venkateswarlu just now wanted a mandate or recommendation to the select committee, You, Sir, did not accept that proposition. However the particular proposition the Opposition has put forward will take the form of party mandate or party opinion. Therefore, we would like to make an adjustment made in the select committee, that after the new university has been formed and it has been successfully functioning four or five years, then, the question of affiliation may be taken up. We have certain reasons for it. As you know, if Visalandhra is going to be formed, the Osmania University will be there. As it is, our Committee Report shows that University is getting a number of grants. At page 38 of the report it is said that it is getting 41 lakhs as an exceptional grant for the teaching and administrative staff. Of late I am afraid, such grants have ceased to be exceptional, Therefore, Sir, if we get Visalandhra we feel

the question of affiliation could be easily solved then. The Osmania University is an affiliating and residential university, and the Rayalaseema colleges may be affiliated to that university. We may presume that Visalandhra will be possible in two years. So, in that way, we can solve the question of affiliation.

Here I want to say one point. I am sure we cannot afford to barter away our educational standards with our emotion But that is precisely what is happening now. There is another point, and that is about general education. We have two types of education in our State · technical education and general education. So far as general education is concerned, I believe, political parties and individuals can affored to be liberal in their approach. Mostly the attitude and approach of the public towards general education is one of obtaining jobs and employment, once education has been completed. The whole idea and purpose of education seems to be one of providing jobs for our boys after their education is over. So far as general education is concerned, there is no danger to the approach we make. We can have any number of courses in teaching Physics, Chemistry, Botany, Mathematics, Political Economy etc. But so far as technical education is concerned, Government must be very clear and very definite about the standard that must be adopted in our State. In this technical education a sort of feeling of regionalism and districtism has developed. Take the question of medical college. It is proposed to upgrade the medical college at Guntur. I am here digressing a little, as the subject I propose to deal may not be strictly relevant to the present Bill. But I do so, for, I want to bring to the notice of the people that the very same spirit of regionalism and districtism is being brought to play on that question. When we do not have facilities for affording relief to poor patients in Guntur Hospital - for, it has got only about 200 beds-you want to have an upgraded medical institution.

But take the case of the King George Hospital at Visakhapatnam You have got all the facilities there, and so all the courses in Medicine can be started in the Medical College there. But that is not favoured. We can as well transfer the Law College from Masulipatam to Guntur — now that the High Court is to be located at Guntur. Our law courts deal with disputes of property, but the doctors who are trained in the medical college have to deal with the lives of people, and so they should be given the best training possible. Therefore we should be a little more careful about medical education. Therefore there is a vast difference between technical education and general education.

So far as this Bill is concerned, we would support it to the hilt. For, we feel that it is very necessary that we should have a residential university at Tirupati straightaway. Necessary funds should be granted. Here one fact should be noticed. The new university requires 18 lakhs grant per annum, while the Andhra University gets an annual grant of 7 lakhs. For the new university, it is said, in the report, that the annual grant should begin with 9½ lakhs in the first year, and then it should progressively increase to Rs. 18 lakhs in the fifth and subsequent years for recurring expenditure. Supposing Rayalaseema sentiment is to be respected, for everybody supports the new university, then, so far as the question of affiliation is concerned it is merely a matter of sentiment. The Hon. Education Minister in his opening speech said that it is imperative that the Rayalaseema colleges should be disaffiliated from the Madras University and bring them either under the Venkateswara University or the Andhra University. I do not know, why he used the word, 'imperative'. I thought that after the formation of the Andhra State, the Tamil-Andhra feeling has gone. But I see the sentiment is there that the Rayalaseema colleges should be disaffi-

liated from the Madras University. If that is a necessity, if it is an imperative necessity, then, let us, in doing so, maintain educational standards also and affiliate them to the Andhra University, which is already functioning, and after theformation of Visalandhra, affiliate the five colleges in Rayalaseema to the Osmania University.

Sri C. PULLA REDDI —Sir, on a point of clarification, Vijayanagaram Raja said that the Rayalaseema Colleges can be affiliated to .... May I know what the suggestion of Rajahsahib is? Does he want the Rayalaseema colleges to continue to be affiliated to the Madras University, or does he want them to be affiliated to the Andhra University or to the Venkateswara University?

Sri P. V. R GAJAPATHI RAJU:—It is not usual for one to be cross-examined. I think I made it clear in my speech. I said it rests with the "imperative' need said by the Hon Minister for Education in his opening speech. I am very clear about it in my mind. The colleges in Rayalaseema districts should be affiliated to our own universities, the Andhra University or the Venkateswara University. But to maintain proper educational standards, it would be far safer to affiliate them Andhra University and later on, two or three years hence to the Venkateswara University. For we have not yet started that university. To think of any such thing even now, would be like a man thinking what name he should give his child, when he had not settled even of which women he should marry. (Laughter) The position of the new University is rather not bright. For in the report it is said that a sum of Rs. 124 lakhs should be provided within the first five years for capital expenditure. Then, grants beginning with 9½ lakhs in the first year and progre-

ssively increasing to Rs. 18 lakhs in the fifth and subsequent years should be made available for annual recurring expenditure. My point is first, guarantee your 18 lakhs for maintenance and then think of affiliating the Rayalaseema colleges to the Venkateswara University. In the meantime, Visalandhra will be formed and we can then think of affiliating them to the Osmania University. Meanwhile do not make regionalism and districtism to bring to bear on educational matters There is no lacuna in my mind. If you want to separate yourself from the Madras University, do so, and affiliate yourself to the Andhra University and not to a non-existing University.

Sri B KRISHNAMURTY RAO :— అధ్యక్షా, ఆంధ్ర రాష్ట్రము మనము సంపాదించుకొని యిప్పటికి ఆరుమాసాలు అయినది. విద్యాశాఖా మంత్రిగారు తిరుపతి విశ్వకళాపరిషత్తుకు సంబంధించిన బిల్లును ప్రవేశ పెట్టినందుకు వీరిని నేను అభినందించుచున్నాను. ప్రవేశ పెట్టడముతోటి, ముఖ్యపట్టణ నిర్ణయము సమస్యవచ్చిన విధముగా, రాజకీయాలకు అత్యంత ప్రధానమైన, అనవసరమైన ఆవేశాలు, కక్షలు, విద్యావిధానంలో వైజ్ఞానికంగా, సంస్కృతికంగా రాష్ట్రమును అభివృద్ధి పరచడములో ఏ పార్టీ కూడా అడ్డురాదు అనిఅనుకున్నాను. కాని దురదృష్టవశాత్తు ఏ పద్ధతిపైన తాత్కాలిక రాజధాని నిర్ణయ సమస్యలు బయలుదేరాయో, వాటికి ఏ విధమైన రంగులు, రూపులు దిద్దారో, అదేవిధమైన రూపురేకలు దిద్దటానికి ప్రతి పక్షము చాలా తీవ్రంగా ప్రయత్నంచేసి వారియొక్క విధానాన్ని విని పించారు. అయితే యిచ్చట రాయలసీమ నుండి వచ్చిన కొంత మంది మిత్రులు మాట్లాడటము జరిగింది. మీా జిల్లానుంచి వచ్చిన శీతారామయ్య గారు యీా యూనివర్సిటీ కేవలము Residential University గా చేయడం మంచిదని చెబుతూ, తన నియోజకవర్గములోని ప్రజలను తృప్తి పరచటానికి Medical College ని అన్ని హంగులతో కూడా ప్రారంభించమని చెబుతూ, తన పార్టీయొక్క నిబంధనలకు వ్యతిరేకంగా కాకుండా మాట్లాడారు. ఇక్కడ ఒక చిన్న సందేహము కలుగుతున్నది, ఈ నాడు మనము

నియంతృత్వం కోరడములేదు. ప్రజాస్వామ్యము కోరుకుంటున్నాము. గనుక ఒకపార్టీ శాసనసభ్యులందరు కలసి వచ్చినా, తక్కిన 7 జిల్లాల శాసనసభ్యులసంఖ్య పెరగదు. మైనారిటి మెజారిటీల సభ్యుల చేతుల్లో బడి యీ రాయలసీమ నలిగిపోతుందా, అనే భయం కలుగుతున్నదని ఈ నాడు రాయలసీమ సభ్యులందరికి చెబుతున్నాను. మొట్టమొదట ఆంధ్ర యూనివర్శిటీ ప్రారంభం చేసినప్పుడు అయిదు జిల్లాలలోవున్న కళాశాలలన్నిటిని ఆంధ్రయూనివర్శిటీకి అనుబంధంగా చేర్చినప్పటికినీ మరల వెంటనే వారు ఆవిధంగా వుండటానికి యిష్టములేక వెళ్ళిపోయారు. అప్పటినుంచి యిప్పటివరకు రాయలసీమ విద్యార్థులు మదరాసు యూనివర్సిటీలో దొరికిన facilities తో విద్య నేర్చుకొంటూ వస్తున్నారు. ఈ నాడు ప్రభుత్వం రాయలసీమ వారియందు మంచి దృక్పథముతో రాయలసీమకు మంచిచేయటానికి ఏ కార్యక్రమము తలపెట్టినా ఏ ప్రాజెక్టు కార్యక్రమము తయారు చేసినా, ఏ తుంగభద్ర హైలెవెల్ చానల్ వంటి దానినో ప్రారంభించినా, ఆ కార్య క్రమమును కూడా ప్రతి పక్షమునుండి ముఖ్యంగా కమ్యూనిస్టు సభ్యులు ప్రతిఘటిస్తున్నారంటే, రాయలసీమ సభ్యులు మైనారటి సభ్యులుగా వున్నారు కదా, ఆ మైనారిటీవారు చెప్పినది వినకుండాపోతే, వారికి భవిష్యత్తు ఏమైనా ఉన్నదా అని నేను ప్రశ్నిస్తున్నాను

జిన్నాగారు పాకిస్తాను కోరి నప్పుడు ఆయన అంతర్యంగా భయాన్ని వెలిబుచ్చారు. దేశమంతట రక్తపాత మవుతుందనే బెదరింపు వెలిబుచ్చారు. అదే భయాన్ని, బెదరింపు యీ నాడు వారందరు వెలిబుచ్చడముకాదు. అటువంటి బెదిరించే ఉద్దేశ్యము మాకులేదు. ఈ నాడు రాష్ట్రములోని వారందరుకలసి మెలసివుండాలి అనుకొంటున్నప్పుడు కొంతమంది వినకుండా వుంటున్నారు. నేను ఒక చిన్న రాజకీయ ఉపద్రవము కలుగబోతున్నదని చెబుతున్నాను. ఈ నాడు తిరుపతి ఆంధ్రులక్రింద వున్నది అంటున్నప్పుడు అరవలు తమకుచెందినది, మాది అని అంటున్నారు. అరవసోదరులు యీ తిరుపతి విషయములో సాంప్రదాయానికి విరుద్ధముగా దుష్ప్రచారము ప్రారంభించారు. తిరుపతిలో అరవసోదరులు వున్నప్పుడు, అరవలకు నాయకుడు, అఖిల భారత నాయకుడు అయిన శ్రీమాన్ రాజగోపాలచార్రిగారు, తనకున్న

గొప్ప రాజకీయానుభవమును పలుకుబడిని ఉపయోగించి ఆంధ్రులకు అన్యాయము చేయాలనే ఉద్దేశ్యముతో ఈ తిరుపతిని కేంద్రప్రభుత్వము యాజమాన్యంలోకి తీసుకోమని ఒక వుత్తరము వ్రాసినట్లు తెలుస్తున్నది. తిరుపతిలో వున్న అరవలుకూడా యిదే ఉద్దేశ్యము వెలిబుచ్చుతూ ఒక మెమోరాండము తయారుచేసి పంపిస్తున్నారు. దీనికి అనుకూలంగానే ప్రక్కనవున్నవారు ఆ విషయము కనుక్కొనడమువల్ల, కొంత జాగ్రత వహించుచున్నారు. ప్రజలలో కలిగిన ఆందోళనను బట్టి, శ్రీ రాజగోపాలచారిగారు తనకువున్న బలాన్ని, తెలివిని వుపయోగించుతూ మనసంస్కృతి గల ప్రదేశము మనకు వచ్చింది అని అరవసోదరులకు చెబుతూ, తిరుపతిని కేంద్ర ప్రభుత్వము యాజమాన్యములోకి రాబట్టుటకు ప్రయత్నిస్తున్నారు.

ఒక విషయం, యిటువంటి విషయాలన్నిటిలో కూడ మన త్రోవకు మన ప్రక్కన వున్న తమిళ సోదరులు అవరోధం కలుగజేస్తున్నారు. శ్రీ చ. రాజగోపాలాచారిగారు హోసూరులో పుట్టారు. మన సరిహద్దులో వున్నవారిని మనం చేర్చుకోవాలని అనుకుంటే యిచ్చట యీ విధంగా కార్యక్రమం ప్రారంభిస్తే మంచిదికాదు. P. S. P. పార్టీ నాయకుడు శ్రీ విజయనగరం రాజాగారు చాలా ఉద్రిక్తం లేకుండా, చాలా సున్నితంగా, శ్రీ పుల్లారెడ్డిగారు చెప్పిన విషయాలనే చెప్పారు. అది అరటిపండ్లు వొలిచిపెట్టి, భోజనం ఆరగించినట్లు అంటే మందు వేసినట్లుగా మాట్లాడారు. ఈనాడు Residential University లో అక్కడవున్న కళాశాలలనన్నిటిని చేర్చిన మంచిదని చెప్పారు. మీది majority మాది miniority. మీ నాయకులు మొట్టమొదటనే యీ వాదన తీసుకువచ్చారు. ఈ నాడు దేశంలో వున్న హిందువులు అంతా తిరుపతి వస్తున్నారు. అందరూవచ్చి డబ్బు తీసుకువచ్చి అక్కడ శ్రీ వెంకటేశ్వరస్వామివారి ముందర కుమ్మరిస్తారు. అవన్నీకూడ కేంద్ర ప్రభుత్వమునకు యిచ్చివేయుమని మన ప్రతిపక్షసభ్యులు కూడ చెబితే మంచిదే, ఆంధ్రుల సంస్కృతిని వెల్లడించే చంద్రగిరి రాజుల కాలంలో యీ దేవాలయము కట్టించబడినందువల్ల యీనాటికి మనకు దానిపై హక్కులు వున్నవి. అంతా బాగుండాలని వుంటే యీ శాసనసభ్యులు అక్కడ Residential University తో తృప్తి పొందకుండా

Affiliated University కు అందరూ వొప్పుకుంటే, రాష్ట్రంలోని యావన్మంది ఆంధ్రులకు మంచిదే. ఇప్పుడు చర్చనీయాంశమైన సమస్య చాలా తీవ్రమైన సమస్య. అందుచేత దానిని రాజకీయాలతో ముడి పెట్టవద్దని చెబుతున్నాను. ఈ కారణంగా రాయలసీమ వారికి కోస్తా జిల్లాల వారికి మధ్య ద్వేషం పెంచవద్దు. ఇట్టి వాతావరణము వుంటే రాష్ట్రం బాగుపడదు. "పొమ్మనలేక, పొగ పెట్టినట్లు" అనే పద్ధతి తెస్తున్నారు. అన్నిటికీ యిదేవిధమైన మార్గం అవలంభిస్తున్నారు. మీరు ధనవంతులు, లక్షలాది డబ్బుకలవారు. సృష్టిలోనే అనుకూల వాతావరణంలో పుట్టారు, రాజకీయాలు బాగుగా తెలుసు. విజ్ఞానము యెక్కువగావుంది. లక్షలకొలది కావలసిన డబ్బు వుంది. గుంటూరు జిల్లావారు యేపార్టీవారైనా, లక్షలు ఖర్చుపెడతారు.

Sri R. SIDDANNA GOWD:—అధ్యక్షా, ఆయన లక్షల కొలది డబ్బు కుమ్మరించారనేది ఆర్డరా? డబ్బును యెవ్వరు కుమ్మరించారు? యెవ్వరికి కుమ్మరించారు? యెక్కడ కుమ్మరించారు? గౌరవ సభ్యుడు ముఖ్యంగా అవన్నీ వివరించినట్లయితే బాగుంటుంది. ఇలాంటి ఆరోపణలు చేయుటం సముచితం కాదు.

Sri B. KRISHNAMURTY RAO:—ఇలాంటివన్నీ యెప్పుడు కలిగాయో ఒకసారి చూచాము. బలవంతులు తమ శక్తిసామర్థ్యములు బలప్రయోగము బలహీనులపై చూపిస్తారు. కలవారు తమ పలుకుబడి నుపయోగించి లేనివారిపై అధికారము చెలాయిస్తారు. పెట్టుబడిదార్లు పై చెయ్యిఅయినప్పుడు యేవిధంగా వుంటుంది? శాశ్వతంగా majority సంపాదించుకొనడానికి వీలుగా తగిన జనాభాగలవారు, బలం, majority లేనివారిపై యెట్లుబలుకుబడి వుపయోగిస్తున్నారో బాగుగా గుర్తించాము. మేము న్యాయము, ధర్మము జరుగుతుందనే దృక్పథంతోనే వున్నాము. మేము యెక్కువగా విద్యలోగాని, డబ్బులోగాని శక్తి సామర్థ్యములు లేనివారము. మేము 5 జిల్లాలవారుగా వుండి రూపత్తు డబ్బు పోసేలోపల వేంకటేశ్వర విశ్వవిద్యాలయం start చేసి, ఈ 4, 5 జిల్లాలు దానికి అనుబంధంగా చేస్తే యిదిరాష్ట్రానికి దెబ్బా?

లేకపోతే రాష్ట్రం బాగుపడదంటారా ? అనేది ఆలోచించాలి. మీరు యే పక్షానికి చెందినా, కేవలం సామాన్య పౌరుల దృక్పథంలో చూస్తే ఏ విధంగా రాష్ట్రక్షేమానికి భద్రతకు భంగం కలుగకుండా వుంటుందో ఆ విధంగా యీ బిల్లును యథాతథంగా ఆమోదించి, residential university కాకుండా, affiliated University గానే వుండడానికి పూనుకొంటారని ఆశిస్తున్నాను.

(At this Stage Sri G. Nagabhusanam occupied the Chair)

Sri P. PUNDARIKAKSHACHARYULU — అధ్యక్షా, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ బిల్లుపైన ప్రతిపక్షమునుండి వచ్చిన అనేక sentiments తో యేకీభవిస్తూ, నేను కొన్ని విషయాలు చెప్ప దల్చుకొన్నాను. ఈ బిల్లును ప్రతిపాదిస్తూ గౌరవనీయులగు విద్యాశాఖామంత్రిగారు ఆంధ్ర విశ్వ విద్యాలయం వుండికూడా, మరొక విశ్వవిద్యాలయం అవసరం యెందుకు కల్గిందో కూలం కషంగా చర్చించారు. ఇది ముఖ్యంగా రావడానికి కారణం ఆంధ్ర విశ్వవిద్యాలయం యేర్పడిన తరువాత, బెజవాడనుండి వాల్తేరుకు విశ్వవిద్యాలయ కేంద్రం తరలించిన తరువాత కల్గింది. అంతకు పూర్వము రాయలసీమ కళాశాలలు ఆంధ్ర విశ్వ విద్యాలయములో వున్నవి. అప్పుడు యే తగాదా లేదు. కాని వాల్తేరుకు తరలించిన తరువాత రాయలసీమ కళాశాలలకు, రాయలసీమ జిల్లాలకు విద్యార్థులకు వాల్తేరు చాలా దూరం అయింది. అందుచేత, మేము ఆంధ్ర విశ్వవిద్యాలయములో వుండలేము, మద్రాసు విశ్వ విద్యాలయములోనే వుంటాము అని రాయలసీమ వాసులు చెప్పటం జరిగింది. ఈ విశ్వ విద్యాలయమునకు రావలసిన అగత్యం విద్యార్థులకు యే సందర్భములో కల్గిందంటే యీ post graduates courses study చేయవలసి యీ విశ్వవిద్యాలయమునకు రావటం జరిగింది.

అయితే ఈ సందర్భములో రాయలసీమ వాసులకు వాల్తేరు రావడం కొంత కష్టం. అందుచేత మద్రాసులోనే ఉంటామని వారు కోరడంలో కొంత సబబుంది. కాని వారికి ఇప్పుడు ప్రత్యేకంగా ఈ

post graduate course లు open చేయడానికి శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీని స్థాపిస్తున్నారు. అది రెసిడెన్షియల్ యూనివర్శిటీగా ఉండాలా అఫిలియేటింగ్ యూనివర్శిటీగా ఉండాలా అంటే రెసిడెన్షియల్ అనే దానితో నేను యేకీభవిస్తాను. అఫిలియేటింగ్ ఎంతమాత్రం అక్కరలేదు, మంత్రిగారి ఉపన్యాసంలో ఆంధ్రకు సంబంధించి నంతవరకు 20 వేలకు పైగా విద్యార్థులు ఉంటారని చెప్పారు వారు ఇచ్చిన లెక్కలలో సర్కారుజిల్లాలలో 20 వేలుగాను రాయలసీమజిల్లాలలో 4 వేలు అని చెప్పారు. ఆయితే ఇది 20 వేలు ఎలా అయిందో మాకు తెలియకుండా ఉంది. 1946 లో లెక్కలు ఎందుకుఇవ్వాలో మాకు తెలియదు. 1946 వ సంవత్సరం అంటే ఇప్పటికి 10 సంవత్సరాలు కూడా కాలేదు. అయినా 10 వేలకు పెరిగింది. మనదేశములో అన్ని రాష్ట్రాలలోని యూనివర్సిటీలను తీసుకుంటాం. అన్నిరాష్ట్రాల్లోనూ కూడా ఒక దానికంటె ఎక్కువ యూనివర్సిటీలు ఉన్నమాట నిజమే. కాని ఒకటి అఫిలియేటింగ్ ఒకటి రెసిడెన్షియల్ యూనివర్సిటీగానుఉన్నాయి. మద్రాసు యూనివర్సిటీలో 20 వేలకు పైన ఉన్నారు. ఇప్పుడు అంతకంటె కూడా ఎక్కువగా పెంచలేదు. ఇప్పుడు వాల్తేరు ఎంత మూలగాఉందో ప్రస్తుత మద్రాసు రాష్ట్రానికి మద్రాసు కూడా అంత మూలగానే వుంది. కాని వారు అలా కోరలేదు. అక్కడ అన్నామలై యూనివర్సిటీ ఉండటంచే అది రెసిడెన్షియల్‌గా ఉంది. కాని మనకు మరొక యూనివర్శిటీ కావలసిన అవసరం ఏమిటో బోధపడకుండా ఉంది. కాని ఈ అఫిలియేటింగ్ యూనివర్సిటీ జూరిస్‌డిక్షన్‌లో నెల్లూరును ఎందుకు కలిపారో మాకు శ్రీకృష్ణమూర్తిరావుగారు చెప్పిన తరువాత అర్థం అయింది. మేము మైనారిటీ వాళ్ళము కాబట్టి మా మెజారిటీ పెంచుకోడానికని చెప్పారు. అయితేవారు మీా వెనుకబడిన జిల్లాలను కూడా ఒకానొకప్పుడు వాళ్ళతో మరోవిధంగా కలుపుకొన్నారు. మద్రాసు వాళ్ళకు దగ్గరగా ఉన్నప్పటికి నిజంగా నెల్లూరు జిల్లావాసులు ఎవరైనా కానీ మేము ఆంధ్రా యూనివర్సిటీలో ఉండం మద్రాసు యూనివర్సిటీలో చేరతాం అని ఎప్పుడైనా అన్నారా? ఇప్పుడు అంటున్నారా? కాని ఈ నెల్లూరును కల్పడం కేవలం అసమంజసముగా ఉంది. నిజంగా ప్రజాస్వామిక రాజ్యంలో ఉండి దాన్ని proposed university లో కలపడము అన్యాయమని చెప్పతున్నాను. అక్కడ ఒక అఫిలియేటింగ్

యూనివర్సిటీ ఇక్కడ ఒక అఫిలియేటింగ్ యూనివర్సిటీ ఉంటే graduates లో different తరగతులవాళ్ళు ఏర్పడుతారు. మద్రాసులో ఉన్నప్పుడు ఉద్యోగాల్లోను వాటిలోను కూడా తగినంత రికగ్నిషన్ సంపాదించడానికి ఎంతకాలం పట్టిందో మనకు తెలుసు. అటువంటప్పుడు ఇప్పుడు కొత్తగా ఏర్పడిన వెంకటేశ్వర యూనివర్సిటీలో పాసైన graduates ను తక్కిన వాటితో సమానస్థాయిలో తీసుకురావాలంటే ఎంతకష్టమో ఆలోచించండి. నిన్న సంజీవరెడ్డిగారు తుంగభద్ర హైలెవెల్ ఛానల్ తీర్మానం పాస్ చేయాలని చెప్పినప్పుడు అది మిగిలినవాటితో పోటీపెట్టకుండా పాస్ చేయాలని చెప్పారు. అలాగే పోటీ ఎప్పుడైనా ఉంటుంది. ఇటువంటి సందర్భములో ఆంధ్రా యూనివర్సిటీ నుంచి ఉద్యోగస్థులను తీసుకోవాలని వచ్చినప్పుడు ఇటువంటి డిఫరెన్స్ ఏర్పడుతుంది. అందుచేత దాన్ని అఫిలియేటింగ్ గా కాకుండా రెసిడెన్షియల్ గానే ఉంచడం మంచిది. ఈ అఫిలియేటింగ్ గా పెట్టడం వల్ల ఏటా ఒక కోటి రూపాయలు ఖర్చుఅవుతోందని ఇంకా రికరింగ్ ఎక్స్పెండిచర్ ఉంటుందని చెప్తున్నారు. ఇప్పుడు మనకున్న ఆర్థిక స్థితివల్ల విద్య ఎంతముఖ్యమైనప్పటికి, ఇంతకంటె ముఖ్యమైన ఆహార సమస్య ఉంది. ఈ కరువుకాటకాలనుంచి తప్పించడానికి తగిన ప్రాజెక్టులు హైస్కూల్సు మొదలయినవి నిర్మించుకోడానికి గాని, లేకపోతే మరో మెడికల్ institution పెట్టుకోడానికి గాని అవకాశం ఉంటుంది. ఆ ప్రాంతములో ఉన్న వాళ్ళు పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులకోసం ఇక్కడికిరావడంకష్టం, కాబట్టి అక్కడ ఒక రెసిడెన్షియల్ యూనివర్సిటీ పెట్టడం మంచిదే. మన కృష్ణమూర్తిరావుగారు చెప్పినదానిలో ఈ విషయం ధ్వనిస్తోంది. దాన్ని బట్టి సెపరేట్ మెంటాలిటీస్ ఏర్పడుతాయి. దీనివల్ల హిందూస్థాన్ పాకిస్థాన్ అనే డివిజన్ క్రిందికి వచ్చినట్లు ultimate గా ఈ రాష్ట్రాన్ని ఇది విభజన చేయడానికి దారితీస్తుందేమో అని మనం కలిసి పనిచేయడానికి వీలుండదని చెపుతూ దీన్ని రెసిడెన్షియల్ యూనివర్సిటీగా చేయాలని దాన్ని సెలెక్టుకమిటీకి పంపిస్తారు కాబట్టి వారు కూడా అలా చేస్తారని ఆశిస్తున్నాను.

Sri K. KRISHNA RAO :— ఉపాధ్యక్షా! ఈ రోజు మన ఎదురుగుండా వెంకటేశ్వర విశ్వవిద్యాలయం బిల్లు ఉంది. దానిలో ఉన్న రహస్యం ఏమిటో తెలుసుకోవాలి. అసలు యూనివర్సిటీలులంటే

ఒక రాజ్యంమధ్య ఉండే ఇంకో రాజ్యం. వాటికికూడా taxes పెంచే అధికారం ఉంది. అంటే వాటికి మనం చెల్లించే జీతాలు మొదలైనవి అన్ని పెంచడానికి తగ్గించడానికి కూడా powers వుంటాయి. అందుచేత మనం జాగ్రత్తగా ఆలోచించాలి మనం కలకత్తా రిపోర్టు చూస్తే Partition of Bengal గురించి తెలుస్తుంది. తరవాత మహమ్మడన్స్ వెళ్ళి వైస్ రాయ్ గారితో చెప్పుకొన్నారు.

In an address presented to the Viceroy, Lord Hardinge at Dacca on 31st January 1912, a number of Muslim representatives of Eastern Bengal and Assam placed certain proposals before him with the object of safeguarding the interests of the Muslim community. They pointed out that the Muslim had taken advantage of governmental educational institutions to any extent comparable with Hindus and they expressed their doubts whether the modifications of the Partition of Bengal might not retard the educational progress of their community.

దానిమీద నేను వేరే చెప్పవలసిన అవసరం లేదు.

Rash Behari Ghosh అనే ఆయన ఇలా వ్రాశారు.

'On the 16th February 1912 a deputation headed by Dr. (now Sir) Rash Behari Ghosh waited on Lord Hardinge and expressed their apprehension that the creation of a separate university at Dacca would be in the nature of an internal partition'

అని చెప్పారు. మనం జరిగిన చరిత్రను తీసుకొన్నామంటే, East Bengal Univerisity West Bengal Univeristy వున్నాయి. అసలు మొత్తం బెంగాల్ అంతటికీ ఉన్నది Dacca Univeristy, అసలు మొదట ఉచ్ఛస్థాయిలో నున్న ఢాకా Univeristy, East Bangal, West Bengal అని మతంరీత్యా political గా Bengal చీలినతరువాత ఆ ఢక్కా యూనివర్శిటీయొక్క ఉచ్ఛస్థాయి లేకుండాపోయింది.

దాని standard పడిపోయింది. అలాగే ఇక్కడ తిరుపతిలో affiliating univeristy పెట్టినట్లైతే అక్కడ ఆ తిరుపతి యూనివర్శిటీకి, ఇక్కడ ఈ Univeristy కి clash వస్తుంది. అనంతపురంలో oil technology college వుంది. ఇప్పుడు దానికి హెచ్చు ఖర్చు అవుతోందని ఒకరు చెప్పారు. ఇది ఎందుకొచ్చింది ఇప్పుడు అని, దానిని ఎత్తివేయటానికి సిద్ధంగా ఉన్నారు. రెండవదేమిటంటే మన ఈ ఆంధ్రదేశంలో రెండు యూనివర్శిటీలు ఉండడంవల్ల Education సరిగా ఉండదు. ఈ ఆంధ్ర రాష్ట్రం ఒకదానిలో ఈ University లు రెండు వుండడంవల్ల ప్రభుత్వానికి డబ్బు ఖర్చు ఎక్కువ, వాటిలో చెప్పే చదువుయొక్క standards కూడా సరిగా ఉండవు. మన దేశంలోని colleges లో చదువుకునే విద్యార్థులకు చాలా ఖర్చవుతోంది. ఇప్పుడున్న colleges కు grants Government సరిగా యివ్వలేకపోతున్నది. ఆ కాలేజీల పోషణకు డబ్బు చాలక fees లను పెంచడం జరిగింది. అసలు ప్రపంచంలో educational గా సాంస్కృతికంగా చాలా ముందుకు పోయినటువంటి సొవియట్ రష్యాలో విద్యార్థికి చాలా వరకు సహాయం ప్రభుత్వం చేస్తుంది. విద్యార్థి 16 రూపాయలు school fees కడితే ప్రభుత్వం 90 రూపాయలు యిస్తుంది. కాని మన రాష్ట్రంలో ఉన్న colleges లో చదివే విద్యార్థులవద్ద 46 రూపాయలను వసూలుచేస్తారు. వారికి చదువుకోడానికా, సరిగా చదువుండదు. ఈ 46 రూపాయలను వసూలుచేస్తున్నట్లు మొన్న Director of Public Insturctions యిచ్చిన report లో వుంది. మామూలు విద్యార్థులవద్దనుంచి 46 రూపాయలు half scholar ships ఉన్న pupils వద్దనుంచి 22 రూపాయలు fees వసూలుచేస్తున్నారు. ఇప్పుడు ఈవిధంగా విద్యార్థుల వద్దనుంచి fees వసూలుచేస్తున్నారు. కాని ఈవేళ ఉన్న కాలేజీలకు సరైన భవనములు గ్రాంట్లులేవు. ఈ కాలేజీలకు అవుతున్న ఖర్చు, ఇంకా ఇతర ప్రజోపయోగకరమైన పనులకు డబ్బులేదంటుంది. ఈ గవర్నమెంట్ కాలేజీలకు భవనములను కట్టించడం, వాటికి గ్రాంట్లు యివ్వడం ఒక burden అని అంటున్నారు. ఇటువంటి burden హెచ్చవుతుందన్నారు. ఇతర పనులకు అసలు డబ్బులేదు. State Finances తక్కువగా ఉన్నాయంటున్నారు. ప్రతిదానికీ డబ్బు లేదంటున్నారు. కాని ఈ ప్రభుత్వం తిరుపతిలో 2-వ affiliating

University పెట్టడానికి సిద్ధపడుతున్నారు. ఇంకా అనవసరమైన భవనాలకు ఖర్చు పెడుతున్నారు. ఇపుడు కనుక తిరుపతిలో యూనివర్సిటీ పెడితే మనరాష్ట్రంలో రెండు యూనివర్శిటీలు ఏర్పడతాయి. ఇప్పుడు దీనిని ఏర్పాటు చేయాలంటే అధమపక్షం 4 లక్షల రూపాయలు ఖర్చు చేయవలసివస్తుంది. ఇప్పుడు ప్రస్తుతం ఒక యూనివర్శిటీకి, మిగతా కాలేజీలకు సరిపోనటువంటి State Finances ఈ రెండు యూనివర్సిటీల పోషణకు డబ్బు సరిపోతుందా ? అని నేను అడుగుతున్నాను.

ఇక్కడ ఆంధ్ర యూనివర్సిటీ ఒకటి రెండవది తిరుపతి యూనివర్సిటీ. ఈ రెండు యూనివర్సిటీలకు ఈ State finance ను ఇవ్వాలి. ఈ రెండు యూనివర్సిటీలవల్ల మన ఆంధ్ర రాష్ట్రములో రెండు Educational States యేర్పడుతున్నాయి. తిరుపతిని affiliating university గా చేయడంవల్ల ఈ Andhra University కి, తిరుపతి యూనివర్సిటీకి మధ్య education లోను మిగతా విషయాలలోను differences వస్తాయి. అంటే రెండు కొత్తకొత్త పాలసీలు వస్తున్నాయన్నమాట. ఆంధ్ర యూనివర్సిటీకి యిప్పుడు జమీందారీల రద్దువల్ల ఇంతవరకు జమీందారులవద్దనుంచి వచ్చే చందాలు కూడా రావడం లేదు. అందువల్ల ఆంధ్రా యూనివర్సిటీకి మన ప్రభుత్వం ఎక్కువ డబ్బు యివ్వవలసివస్తోంది. మళ్ళీ యీ తిరుపతి యూనివర్సిటీకి కూడా డబ్బు కావాలి. ఇప్పుడు ప్రభుత్వం యిచ్చే గ్రాంట్సు Colleges కి చాలడములేదు. వాళ్ళు College Examination Fees అనీ, library fees అనీ, Games fees అని వసూలు చేస్తూంటారు. Library fees వసూలు చేస్తున్నారన్నమాటేకాని libraries ను మాత్రం ఏమీ అభివృద్ధిచేయడంలేదు. ఆ libraries 1904 లో ఎలావున్నాయో ఈనాడు 1954 వ సంవత్సరములో కూడా అదేవిధముగా వున్నాయి. ఈ ఫీజులన్నీ వారెందుకు వసూలు చేస్తున్నారో వాటిని అందు కుపయోగపరచడం లేదు. అవి general expenses కి పోతుంది. ఈ Colleges లో చాలా ఎక్కువ fees ను వసూలు చేస్తున్నారు. నేను చూస్తున్నాను, మా వాళ్ళనుకూడా కాలేజీలలో చదివిస్తున్నాను, ఇంకా కాలేజీలలో చదువుకునే వాళ్ళను మా నెల్లూరు జిల్లాలో చూస్తున్నాను. చాలామంది ఈ College చదువులకోసమని చెప్పి ఆస్తులను అమ్మేస్తున్నారు. Lands ను mortgage చేసేస్తున్నారు.

కాని Education యేమంత బాగుండడం లేదు. సాధారణముగా examination fees వల్ల డబ్బు ఎక్కువ వస్తుంది. అందుచేతనే ఇప్పుడు కాలేజీలలో సాధారణంగా ప్యాసయ్యేవాళ్ళ percentage 20 వుంటుందేమో. ఈ examination fees కోసమని చెప్పి failures ఎక్కువ చేస్తున్నారు. ముందు కొంతమందిని fail చేసినట్లైతే ఎక్కువ examination fees వస్తుంది. అలాగ చాలా మందిని ఏటేటా fail చేస్తూంటే వచ్చే examination fees 10 రెట్లో, 20 రెట్లో వస్తుంది. Fees వల్ల రాబడి ఎక్కువ రావటానికి గాను, ఈ failures చేసే విధానముకూడా వుంటున్నది. ఇదొక policy గా కూడా తయారవుతోంది. కొంచెం మంచి మార్కులు వచ్చినవాళ్ళనుకూడా ఈ policy ననుసరించి fail చేయడం జరుగుతోంది. ఇప్పుడున్న colleges కు వచ్చే డబ్బు తక్కువ, వాటి పోషణకు మాత్రం ఎక్కువ డబ్బు కావాలి. అందువల్ల వాళ్ళు ఈ విధంగా fees ఎక్కువ చేయడం జరుగుతోంది అసలు ఈ విధంగా colleges వుంటే రాయలసీమలోని కాలేజీలు అసలే తక్కువ. అక్కడ చదువుకునే విద్యార్థులు కూడా చాలా తక్కువమంది వుంటారు. వారికోసమై ప్రత్యేకంగా ఒక యూనివర్సిటీని ఏర్పాటు చేసినట్లైతే అందులో చదివే విద్యార్థులుకూడా చాలా తక్కువమంది వున్నారు అసలు రాయలసీమలో యూనివర్సిటీ పెడితే అచట చదువుకోడానికి వచ్చేవాళ్లు చాలా తక్కువ మంది వుంటారు. అసలు ఈ కాలేజీ చదువుకు ముందుగా Secondary Education, Elementary Education చాలా బాగా వుండాలి. అసలు రాయలసీమలో University Education గాని, Elementary Education గాని ఏమీ బాగాలేదు. అసలు ఆ schools లేని ఏరియాస్; villages చాలా ఉన్నాయి. ఉన్న కొంచెం schools లోనే చాలా తక్కువమంది విద్యార్థులు ఉన్నారు. ఆ ప్రక్కనున్న ప్రజలంతా చాలా బీదవారవడంచేత వాళ్ళు వాళ్ళయొక్క పిల్లలను చదివించడంలేదు. అప్పటి Elementary Education, Secondary Education బాగా ఉంటే ఈ colleges లో చదువుకోడానికి వచ్చే విద్యార్థులు ఎక్కువవుతారు. వారు బీదవాళ్ళవడంచేత అచట ఆ పిల్లలకు జీతం పుచ్చుకోకుండా చదువు చెప్పడం అవసరం. ఈ తిరుపతి యూనివర్సిటీని కనుక affiliating University చేస్తే

అచ్చట కాలేజీలలో ఉన్నవారిలో చాలామంది బీద విద్యార్థులవడం వల్ల వారు ఏమాత్రం చదువుకోలేరు. అందుచేత గవర్నమెంటు వారికి fees లేకుండా accomodation free గా యివ్వాలి, తిండి పెట్టాలి. అప్పుడు కాని బీద విద్యార్థులు ఆ కాలేజీలలో ఎక్కువ మంది చదవడానికి వీలుండదు. ఇలాగయితేనే అచ్చట Education develop అవుతుంది. ఈ University కనుక రాయలసీమలో పెడితే రాయలసీమ ఎక్కువ develop అవుతుందని అంటున్నారు. ఇది పెట్టినందువల్ల రాయలసీమ అభివృద్ధి చెందదు సరికదా, ఇది ఒక గుదిబండగా మాత్రమే అక్కడవారికి తయారవుతోంది. ఈ University వచ్చిన తరువాత పిల్లకాయలు చదువులకోసమై ఇంకా ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టవలసి వస్తుంది. ఇప్పుడున్న colleges కి సరైన buildings లేనేలేవు. వారికి యింతవరకు ప్రభుత్వం Building grants యివ్వలేక పోయింది. ఈ University పెడితే Building grants ఎక్కువగా ఉంటాయనుకుంటున్నారు. అసలు ఆ University కి ఎక్కువ గ్రాంట్స్, colleges కు ఎక్కువ grants యివ్వాలంటే అచ్చట ప్రజలమీద ఎక్కువ పన్ను వేయవలసి ఉంటుంది. భవనములను కట్టించడానికి గాను విరాళములను పోగుచేయాలి. అలా పోగుచేసినట్లైతే ఆ విరాళములిచ్చినటువంటి ప్రాతినిధ్యం ఆ University లో ఎక్కువవుతుంది. 25 వేల రూపాయలు ఎవరిస్తే వారికి 3 సంవత్సరముల వరకు వోటు యిస్తారు. ఇలాగ ఓట్లు వేలం వేయడం జరుగుతోంది. ఈ University ని తిరుపతిలో affiliating University గా పెట్టడం వల్ల ఈ University బాగుపడేదిలేదు. దీనివల్ల రాయలసీమకు వచ్చే లాభంలేదు, ఇటువంటి cultural Institute బాగా అభివృద్ధిలోకి, standard లోకి రావాలంటే దీనిని Residential గా తిరుపతిలోనే ఉంచితే బాగుంటుంది. ముందుగా రాయలసీమలో Secondary Education, Elementary Education బాగా ఉండేటట్లు చూడాలి. అప్పుడే college లోని Education కూడా బాగుపడుతుంది. అనంతపురం జిల్లాలో అసలు Secondary Schools గాని Elementary Schools గాని చాలినంత లేవు. ఇప్పుడు ఈ colleges కొన్ని కొన్ని చోట్ల ఏమీ తెలియని, Land lords చేతిలోనికి పోతున్నాయి, ఈ cultural institutions అయిన colleges అటువంటివారి చేతులలోకి వెళ్ళడం

ఇష్టంలేదు. వారు land lords. వాటికి విరాళాలు దాదాపు 4 లక్షలలో ఎంతో collect చేసి యున్నారు. ఆ కాలేజీలలో వాళ్ళ ప్రాతినిధ్యం ఎక్కువవుతోంది. అందువల్ల అక్కడ చదువుకూడా సరిగా ఉండడంలేదు ఇప్పుడు రాయలసీమలోని కాలేజీలుకూడా అక్కడున్న జమీందారుల చేతులలోను, land lords చేతులలోను ఉంటాయి.

నెల్లూరులో V. R. College ఉందంటే దాంట్లో, సరిగా చదువు సాగడంలేదు. అచ్చట స్టూడెంట్స్ B. A. లో 2 సార్లు 3 సార్లుకూడా తప్పుతున్నారు. అక్కడ వారు ఈ కాలేజీలో professor కి రోజుకు 4 రూపాయలజీతం ఎందుకియ్యాలి, అంటున్నారు. B. A. లు M. A.లు చదువుకున్న professors యొక్క value వాళ్ళకేం తెలుసు ఇంతచదువుకున్న వాళ్ళని వాళ్ల తలపని వాడితో పోలుస్తారు. అందుచేత ఇటువంటి cultural institution అలాంటి illiterates చేతులలోకి వెళ్ళిందంటే ఈ college యొక్క dignity పోతుంది. అందువల్ల అక్కడ University కనుక నెలకొల్పినట్లయితే అటువంటి వాళ్ళ domination ఎక్కువై పోతుంది. అది సక్రమంగా నడవడానికి, అభివృద్ధిలోనికి రావడానికి ఏమీ అవకాశం ఉండదు. అక్కడ ఈ కాలేజీలపై అటువంటి వాళ్ళయొక్క domination ఎక్కువగా రానీయకుండా ఉండడానికి తిరుపతిలో ఒకే Residential University పెడితే అక్కడే teaching అది అంతాఉండి ఇంక ఏ ఇతర కాలేజీలతోను సంబంధంలేకుండా ఉంటుంది. అలాగ ఉంటే అది కొంతకాలానికి చాలా అభివృద్ధిలోనికి రావడానికి అవకాశం ఉంటుంది. అంతేకాని దీనిని Affiliating University గా చేసి ఇతర రాయలసీమ కాలేజీలను affiliate చేసినట్లైతే illetaratesయొక్క domination లో ఉన్న ఆ కాలేజీలు దీనిలో ఉండడంవల్ల ఇది అభివృద్ధిలోకి రావడానికి ఏమాత్రం వీలుండదని చెప్తున్నాను. అందువల్ల దీనిని Residential University చేసి దీనికి ఎంతడబ్బు కావలిస్తే అంత డబ్బు ఖర్చుపెట్టి అభివృద్ధిచేసి, దానిలో చదువు చాలా బాగా చెప్పించడానికి పాటుపడాలి. దానికి ఎంతడబ్బు ఖర్చుపెడితే అంత అభివృద్ధిలోకి వస్తుంది. అంతేకాని దీనికి రాయలసీమ కాలేజీలను కలిపి

Affiliation అనే టటువంటిదానికి ఏ మాత్రం scope యివ్వకుండా తిరుపతిలో Residential University గా చేసినట్లైతే బాగుంటుంది. అక్కడ Affiliating University పెట్టి దానితో నెల్లూరు గుంటూరు కాలేజీలను కూడా affiliate చేయమని వరదాచార్యులు గారు చెప్పారు. అక్కడ Affiliating University పెట్టి దానికి నెల్లూరు కాలేజీలనుకూడా affiliate చేయడం మంచిదని కృష్ణమూర్తి రావుగారన్నారు. అసలు మా నెల్లూరు కాలేజీలవారు ఈ తిరుపతి Affiliating University లో చస్తే చేరమని అంటున్నారు. అలా కనుక చేరినట్లైతే దానికి ఇపుడు ఉన్న standard పోతుంది. ఆ కాలేజీ Principal గారు దానిలో మేము ఎన్నటికీ చేరము. Andhra University లో ఉంటేనే మాకు మంచిదని చెప్పారు. అసలు యిలాగ చెప్పడం అంటే చెప్పారుకాని, అక్కడ Affiliating University పెట్టినందువల్ల వచ్చేనష్టాలను వారు ఆలోచించారా ? అక్కడ కనుక Affiliating University పెడితే Bengal లో Dacca University గతి ఎలాగ వచ్చిందో వీటిగతి కూడా అలాగ వస్తుందని నేచెప్తున్నాను Affiliating University పెట్టినందువల్ల రాయలసీమ కేమాత్రం అభివృద్ధి వుండదు కాని నష్టం వస్తుందని చెప్తున్నాను.

చరిత్రనుంచి కొంతవరకు మనం పాఠాలు నేర్చుకోవాలి. రాష్ బిహారీ ఘోష్ చెప్పిన మాటలే యీనాడు యీ తట్టునున్న సభ్యులు చెబుతున్నారు. రాష్ బిహారీ ఘోష్ కమ్యూనిస్టుకాదు. చరిత్రలో జరిగింది మీకు జ్ఞాపకం చేస్తున్నాను. కరాచీ యూనివర్సిటీ, అలహాబాదు యూనివర్సిటీ, అలీఘర్ యూనివర్సిటీ examples వున్నవి. Politics వల్ల యూనివర్సిటీలు కూడా విచ్ఛిన్నకరంగా తయారవు తున్నవి. అలహాబాదు యూనివర్సిటీ వుండగా Aligarh University ఎందుకు పెట్టవలసి వచ్చింది. కలకత్తా యూనివర్సిటీ వుండగా ఢాక్కా యూనివర్సిటీ ఎందుకు పెట్టవలసి వచ్చింది ? దీనికి కారణం ఏమిటంటే education విషయములో politicians జొరబడి తమయొక్క స్వప్రయోజనాలకై వినియోగించడమే. మనకు Constitution వచ్చిన తరువాత మొట్టమొదట స్థాపించుకుంటున్న

యూనివర్సిటీ యిది. మనకు విద్యా విధానం గురించి కొన్ని కోరికలున్నవి. ఎన్నోకలలు కన్నాము. IV Form నుండికూడా University లోనే వుండాలని కూడా వున్నది. Adult franchise మీద వచ్చిన యీ Assembly లో కూడా క్రొత్త పద్ధతులు ప్రయోజనకరమైన పద్ధతులుపైన యూనివర్సిటీని రూపొందించే బదులు పూర్వపు యూనివర్సిటీ మాదిరి prototype గా పెట్టామంటే అభివృద్ధి అయినటువంటి వాళ్ళం కాదు. అందువల్ల యీ బిల్లును జాగ్రత్తగా ఆలోచించాలి. నెల్లూరును ఎందుకు వెంకటేశ్వర యూనివర్సిటీలో affiliate చేస్తాం అంటున్నారో అర్థం కావడం లేదు. నెల్లూరుజిల్లా వారెవరూ ఆంధ్రా యూనివర్సిటీ నుండి విడిపోవడానికి యిష్టపడరు. ఈ విషయం నెల్లూరులోని public opinion తెలుసుకొని చెప్పుతున్నాను. రాయలసీమ జిల్లావారెప్పుడైనా మద్రాసునుండి విడడానికి అభ్యంతరాలు చెప్పారుకాని నెల్లూరు జిల్లావారు 110 మైళ్ళ దూరం మాత్రం వున్నప్పటికి ఆంధ్ర దేశం పురోభివృద్ధి కాంక్షించిన వారు కనుక ఎప్పుడూ ఆంధ్ర యూనివర్సిటీలోనే వుండాలని కోరుతారు. అందుచేత నెల్లూరును affiliate చేయక నెల్లూరు పురోభివృద్ధికి తోడ్పాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

Sri K. VARADACHARI :—Mr. Krishna Rao has been kind enough to make a most practical suggestion, in asking for feesless and scholarshipless education.

Sri L. LAKSHMANA DAS —అధ్యక్షా! ఈనాడు మనం క్రొత్తగా స్థాపించుకున్న యీ ప్రభుత్వంలో ఒక యూనివర్సిటి స్థాపించుకోవడం నిజంగా అసెంబ్లీకి ఒక గర్వకారణం. ఈ యూనివర్సిటీ విషయంలో చాలా డబ్బు అయిపోతుంది. డబ్బు చాలదు అనే దృష్టితో మన మిత్రులు మాట్లాడారు. కాని పై దేశాలతో పోల్చి చూచుకుంటే భారత దేశంలో వున్న యూనివర్సిటీలు చాలా తక్కువ. అందుచేతనే మనం హెచ్చు యూనివర్సిటీలు స్థాపించుకోడానికి డబ్బు ఖర్చుచేయాలి. కనుక ఆంధ్ర ప్రభుత్వం ఒక యూనివర్సిటీని స్థాపించడానికి పూనుకోవడం చాల సంతోషకరమైన విషయం. నిజంగా ఆంధ్ర ప్రభుత్వం ఎంతో ధైర్యసాహసాలతో యీ శాసనం తీసుకువస్తే సభ్యులు గర్విస్తారని,

ఆమోదిస్తారని, దానిపై ఏలాటి ఆందోళన లేకుండా సహకరిస్తారని ఆశిం చాము. కాని దీనికి రాజకీయాలు ముడిపెట్టి కొందరు మిత్రులు మాట్లాడడం విచారకరమైన విషయం. నిజంగా యూనివర్సిటీ విష యాలు ధనవంతుల చేతులలోనికి పోతుంది అన్నారు. మొట్టమొదట మన ఆంధ్ర యూనివర్సిటి 26 సంవత్సరాలక్రితం స్థాపించుకున్నప్పుడు ఎవరూ సహాయం చేయనపుడు జమీందారుల సహకారంతో యీ యూనివర్సిటీ ఎంతో అభివృద్ధిచెందిందన్న సంగతి మరచిపోకూడదు. జమీందారులు ధనం యిచ్చినందువల్లనే యీనాడు యూనివర్సిటీ మంచిదశలో వున్నదన్న విషయం మరచిపోకూడదు. అలాంటప్పుడు అదేవిధంగా యీనాడు రాయలసీమలో ఒక ఉత్సాహంతో ప్రత్యేక మైన యూనివర్సిటీ కావాలని కోరుతున్నప్పుడు వారి ఉత్సాహానికి అనుకూలంగా మనం తిరుపతి విశ్వవిద్యాలయం స్థాపించడానికి తిరుపతి దేవస్థానంవారు ఇందుకు ధనం వెచ్చించ నిర్ణయించింది. కనుక ఆంధ్ర సంస్కృతి, విజ్ఞానాన్ని పెంపొందించే విధంగా నూతనమైన విద్య నభ్యసింపచేస్తే మన సంస్కృతి అభివృద్ధికి విశ్వ విద్యాలయం చాలా వుపకరిస్తుంది. అయితే Affiliated University లేకుండా Residential University అనే విషయంలో వాదోప వాదాలున్నాయి. కాని క్రొత్తగా ఒక మన ఆంధ్రరాష్ట్రంలోనే జరుగు తున్న విషయం కాదు. చాలా రాష్ట్రాలలో కూడా ఒకే రాష్ట్రంలో రెండుమూడు Affiliated Universities ఉన్న సంగతి మనకు తెలుసు. అందుచేతనే దీనినిగురించి మనం రేపు సెలెక్టుకమిటీలోకూడా సమగ్రంగా ఆలోచించి యీ యూనివర్సిటీని ఏ విధంగా రూపొందించాలో రాయల సీమ వారికి తృప్తికరంగా వుండే విధంగా గమనించాలి. దీనిలో రాజ కీయాలకు ఏమీ అవకాశాలు లేవు. నెల్లూరుకాదు, గుంటూరు క్రిష్ణా జిల్లాలను కలుపుకున్నా రాజకీయబలం పెరుగుతుందనుకోవడం పొరబా టని మనవి చేస్తున్నాను.

యూనివర్సిటీ విద్యావిషయంలో యూనివర్సిటీవల్ల రాజకీయాలు అభివృద్ధిచెందవు. ఈ విశాఖపట్నం జిల్లాలో విశాఖపట్నం యూనివర్సి టీకి నెల్లూరు మొదలు శ్రీకాకుళంవరకు అన్ని కాలేజీలు మాకు వున్నప్పటికీ ఆంధ్రదేశపు రాజకీయాలలో విశాఖపట్నం నాయకత్వం లేదని మీకు తెలుసు. అందుచేతనే యూనివర్సిటీ వున్నంత మాత్రం

చేత అన్ని కాలేజీలు వున్నంతమాత్రంచేత రాజకీయ నాయకత్వం వస్తుందనుకోవడం చాల పొరబాటు అని మనవిచేస్తున్నాను. మిత్రులు క్రిష్ణారావుగారు రష్యా విద్యావిధానంగురించి చెప్పారు. రష్యా విధానమునకు మన దేశ విధానమునకు చాల తేడా వున్నది, అక్కడ యిలాంటి చర్చలు జరిగివుండవు. మనది ప్రజాస్వామ్యం. అక్కడవున్నది నియంతృత్వం. అందుచేత సామ్యతలు చూపడం ఉచితమైనది కాదు అని మనవిచేస్తున్నాను. అందుచేతనే ఈ విశ్వవిద్యాలయం స్థాపించుకోడంలో మనం గర్వించాలి. క్రొత్తగా స్థాపించుకున్న యీ రాష్ట్రంలో రెండో విశ్వవిద్యాలయం స్థాపించుకుంటున్నామంటే దానికి ముఖ్యంగా మనకు యీ గవర్నమెంటుకు నాయకత్వం వహించిన ప్రకాశంగారి ధైర్యసాహసాలే కారణమని నేను గట్టిగా చెప్పగలను. అందుచేత ఈ విశ్వవిద్యాలయం గురించి సంపూర్ణంగా పార్టీ భేదాలు మానుకొని ఈ విశ్వవిద్యాలయం స్థాపించడానికి ప్రయత్నం చేయాలి. మనకు చాలినన్ని విశ్వవిద్యాలయాలు లేవు, చాలినన్ని కాలేజీలు లేవన్న విషయం, కాలేజీలలో సీట్లకుపడే పాట్లను తలచుకుంటే తెలుస్తున్నది. క్రొత్త పద్ధతులలో విద్యావిధానం జరగాలని క్రిష్ణారావుగారు అన్నారు. అది యోచించవలసిన విషయం. ఇప్పుడు దేశం యొక్క అభివృద్ధికి వుపయోగపడే విద్యావిధానం కావాలి. వుదాహరణకు మనవిచేస్తున్నాను' Medical Colleges వున్నాయి. వాటిలో ఎంతో డబ్బు ఖర్చుపెట్టి ప్రభుత్వం medical students ను తయారుచేస్తుంది. దానికి ఎంతో డబ్బు ఖర్చుపెడుతుంది. Medical Colleges మీద ధనం వెచ్చించి medical students ను తయారు చేస్తున్నారు. దానికి ప్రభుత్వం చాలా డబ్బు ఖర్చుపెడుతోంది. కాని మెడికల్ కాలేజీలో తయారయ్యే విద్యార్థులు చాలావరకు పట్టణాలలోనే ఉండిపోయి పల్లెలకు ఉపయోగము లేకుండా పోతున్నారు. అటువంటప్పుడు techinical గా ప్రజలకు ఉపయోగపడే విద్యావిధానం గరిపి, ధనం వెచ్చించి చదువు చెప్పుచున్నప్పుడు వారు ప్రజలకు ఉపయోగపడేటట్లు చేయాలంటే డిగ్రీలు యివ్వకముందు ప్రతి విద్యార్థి రెండు మూడు సంవత్సరాలు పల్లెటూళ్ళలో పనిచేస్తే గాని డిగ్రీలు ఇవ్వంఅనో, లేక recognition ఇవ్వం అనో regulation పెట్టుకోవాలి. మన కాలేజీలు technical side న లోటుపడియున్నవి. అటువంటివి ధార్మికసంస్థల్లో తిరుపతిలో స్థాపించడం కాకుండా

విద్యావిధానంలో లలితకళలకూ, సారస్వతం అభివృద్ధి చేయుటకు అవకాశాలుండునట్లుగా ఏర్పాటు చేయాలి. అంతేకాకుండా ఈనాడు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారత దేశంలో ప్రప్రథమంగా స్థాపిస్తూయున్న విశ్వవిద్యాలయం తిరుపతి విశ్వవిద్యాలయం అనుకుంటున్నాను. అందుచేత ఈ విషయంలో పార్టీ విభేదాలు లేకుండా అందరూ సమిష్టిగా పనిచేసి, ఎటువంటి ఆక్రోశాలు లేకుండా మన విద్యా విధానం అభివృద్ధి చెందేటట్లుగా కృషిచేయాలి. విశ్వ విద్యాలయం రాయలసీమలో యున్నా ఎక్కడున్నా అంతా ఆంధ్ర దేశమే. అందరము ఆంధ్రులమే అనేభావంతో, మన ఆంధ్ర దేశంలో ఒక భాగం అభివృద్ధి చెందినప్పుడు మనం గర్వించ వలసిన విషయం. అందువల్ల మనం ఈ విషయములో తర్జన భర్జన చేయకుండా కమ్యూనిష్టు పార్టీ అనిగాని, కాంగ్రెసు పార్టీ అనిగాని, మరోపార్టీ అనిగాని విభేదాలు కల్పించుకోకుండా అందరం ఏకీభవించి మార్పులు తెచ్చుకోవలసియుంటే Select Committeeలో చర్చించి మార్పులు తెచ్చుకోవడం అవసరం కాని కొంతమంది మిత్రులు మాట్లాడుతూ చాన్సలర్ ఎందుకు, Pro-Chancellor ఎందుకు, Vice-Chancellor ఒక్కరూ ఉంటే చాలదా అన్నారు. ఆ పదవులు గౌరవ పదవులుగాని దానికొరకు ఖర్చయ్యేది ఏమీలేదు. మూడు వేలు ఇచ్చినవారికి Senate సభ్యత్వము ఎందుకని మిత్రులు విమర్శించారు. విద్యావిషయంలో ధనం రాబట్టుకొని అభివృద్ధి చేయుటలో తప్పేమీ లేదు. ధనవంతులు యూనివర్సిటీ మీద ఏ మాత్రమూ అధిపత్యము వహించుట లేదని ఆంధ్ర విశ్వ విద్యాలయ విషయంలో మీకు బాగా తెలిసిన విషయమే. జయపురం మహారాజాగారు సంవత్సరానికి లక్ష రూపాయలిచ్చి ఈ విశ్వ విద్యాలయాన్ని పోషించారు. మనం ఇప్పుడు కూర్చున్న ఈ హాలు తిక్కవరపు రామిరెడ్డిగారు కట్టించి ఇచ్చారు. జయపురం మహారాజుగారు కాని తిక్కవరపు రామిరెడ్డిగారు గాని లక్షలు డబ్బు ఇచ్చినా ఈ యూనివర్శిటీలో ఏమైనా అధిపత్యము వహిస్తున్నారా ? అందువల్ల అట్టి అనుమానాలకు తావులేదు. కేవలం presumptions పెట్టుకుని ఊహాగానంచేయుటవల్ల లాభంలేదు. మనమందరము సమిష్టిగాయుండి మన విద్యావిధానం అభివృద్ధి చేసుకోవాలి. దేశ భవిష్యత్తు దేశ సంస్కృతి, దేశ నాగరికత పెంపొందించుకోవాలంటే, ఏ పార్టీకి చెందినా అందరమూ ఆంధ్రులమే, ఆంధ్రదేశములో

ఏ ఘనకార్యము జరిగినా అందరమూ గర్వించ వలసినదే. అందువల్ల తర్జనభర్జన పడకుండా రాయలసీమ వాసులకు లోపం కల్గకుండా ఏవిధంగా అభివృద్ధి చేసుకోవాలో ఆలోచించాలి. రాయలసీమ కాలేజీలు ఆంధ్రా యూనివర్సిటీకి ఎందుకు affiliate కాలేదు, మదరాసు యూనివర్సిటీలో ఎందుకుండాలని నాకుకూడా చాలా బాధగాయున్నది. వారి కాలేజీలు వెంటనే ఆంధ్రా యూనివర్సిటీలో affiliate అయి వారికి ప్రత్యేక సౌకర్యాలు కల్గించుటకు ఆంధ్ర దేశంలో ఎవ్వరూ వెనుదీయరని మనవి చేస్తున్నాను. రాయలసీమ ప్రాంతం చూచినప్పుడు నిజంగా ఈ ప్రాంతాన్ని ఎంతైనా అభివృద్ధి చేయవలసియుంది. దాన్ని గురించి ఖర్చు పెట్టే ప్రతి కాని దుర్వినియోగం చేస్తున్నామని ఎవ్వరున్నూ అనుకో కూడదు. రాయలసీమలో మన సోదరులను అభివృద్ధిలోకి తీసుకువచ్చుటకు వినియోగిస్తున్నామని మరచిపోకూడదు. రాయలసీమలో మనం కోట్లకొలది ఖర్చుపెడుతున్నామని విచారించ కూడదు. కర్నూలులో capital పెట్టినందువల్ల ఆ పట్టణం అభివృద్ధి చెందుతోంది అంటే మన మందరం గర్వించవలసిన విషయం. ఈనాడు కర్నూలులో capital పెట్టకపోతే మరో 50 సంవత్సరాలైనా ఆ పట్టణం అభివృద్ధి చెందే అవకాశం ఉన్నదా అని మిమ్మల్ని ప్రశ్నిస్తున్నాను. (నవ్వు) ప్రతి కుటుంబంలోనూ ఒక పట్టభద్రుడుండేటట్లు చూచిననాడే మన దేశాన్ని ముందుకు తీసుకొని పోవుటకు అవకాశం ఉంది. విద్యా విధానముపై ఎంత ఖర్చు పెట్టినా ఆ ఖర్చును గురించి వ్యతిరేక భావాలు ఉండనవసరంలేదు. ఈ బిల్లులో చిన్న చిన్న మార్పులుంటే ఆలోచించుకోవచ్చును. ఈబిల్లులో ఏవో రాజకీయ కుతంత్రాలున్నాయని ఆవేదనతో విమర్శించడం తగని పని అని మిత్రులకు మనవిచేస్తూ తిరుపతి విశ్వవిద్యాలయం వెంటనే జులైలో ప్రారంభించునట్లు తోడ్పడాలని హృదయ పూర్వకంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

Sri PRAGADA KOTAIAH :— ఉపాధ్యక్షా ! ఈ తిరుపతి ప్రత్యేకంగా విశ్వవిద్యాలయం కావాలని ఒక తీర్మానం వస్తోందన్నప్పుడు సాధ్యమైనంతవరకూ సభలో అట్టే వివాదాలకు దారితీయని విధంగా బిల్లు రూపొందిస్తారని ఆశించాము గాని అది దురదృష్టంగానో, అదృష్టంగానో ఈనాడు విద్యామంత్రిగారు ప్రవేశపెట్టిన బిల్లు చాలా వివాదాలకు దారి తీస్తోంది. అది ఏమిటంటే ప్రత్యేకంగా ఈ విశ్వవిద్యాలయం

రాయలసీమ జిల్లాలకు సంబంధించి ఈ విశ్వవిద్యాలయం ఏర్పాటు చేస్తున్నామన్నారు. రాయలసీమ నాలుగు జిల్లాలు పశ్చిమజిల్లాలు, కోస్తాజిల్లాలు అనే బేదం బహుశః వాల్తేరు విశ్వవిద్యాలయంతో ప్రారంభమై ఉండవచ్చు. అందులో ముఖ్యంగా Waltair లో విశ్వవిద్యాలయం వచ్చిన తరువాత, రాయలసీమ వారికి ఆక్రోశం ఏర్పడడం, ఆ జిల్లాలకు యూనివర్శిటీ పరిపాలనలో తగినంత ప్రాతినిధ్యం ఇచ్చినప్పటికీ, వారి కాలేజీలు మదరాసు యూనివర్శిటీతో అనుబంధంచేసి, ఇప్పుడు గాని, ఇకముందుగాని ఆంధ్రవిశ్వవిద్యాలయంతో సంబంధం పెట్టుకొనుటకు వారొక్కట్టి ఇష్టపడడంలేదనేది స్పష్టంగా అందరికి తెలిసిన విషయం. కాని ఈ తగాదా పరిష్కారం అవడానికి, ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత, కొన్ని పరిస్థితులు ఏర్పడడం జరిగింది. ముఖ్యంగా శ్రీబాగు పాక్టుపేరుపెట్టి capital రాయలసీమలో యుండాలని, శాసనసభ ఇచ్చినా ఇవ్వక పోయినా కాల ప్రభావంవల్ల కర్నూలులో capital ఏర్పడింది. శ్రీబాగ్ pact ను అనుసరిస్తున్నామని చెబుతూ హైకోర్టు విశాఖపట్టణంలో పెట్టాలన్నారు. అదికూడా కాల ప్రభావంవల్ల గుంటూరులో ఏర్పడడం జరిగింది. వాల్తేరు విశ్వవిద్యాలయంతో సంబంధం పెట్టుకోము ప్రత్యేక విశ్వవిద్యాలయం కావాలని కోరడంలో నేను తప్పుపట్టుకోవడంలేదుగాని దీని నిర్మాణం జాగ్రతగా పరిశీలించి నప్పుడు కొంతబాధ కల్గించుచున్నది. వాల్తేరులో యూనివర్శిటీకి, ఇప్పుడు ఏర్పర్చదలచుకున్న యూనివర్శిటీకి విద్యావిధానంలో ఎక్కడా తేడా కనిపించడంలేదు. ఇక్కడున్న విద్యా విధానం మాదిరిగానే తిరపతిలో ప్రత్యేకంగా పెట్టాలంటున్నారు.

ఇప్పుడు ఉన్న విద్యావిధానం యావత్తు పూర్తిగా తిరుపతిలో పెట్టవలెనని అంటున్నారు. ఇప్పటికే దేశంలో ఈ University Education ఫలితంగా కొంత మందికి చాలా డిగ్రీలు వచ్చాయి గాని దేశంలో నిరుద్యోగం పెరిగి పోతుంది. ఈ నిరుద్యోగం పెరగకుండా వుండే విధానాన్ని ప్రభుత్వంతలపెట్టవలెను. అందుకు ఆంధ్ర దేశం అంతకు వర్తించే యూనివర్శిటీని ఏర్పాటుచేస్తే బాగా ఉంటుంది. అలా కాక మామూలు విద్యకొరకు మరొక యూనివర్శిటీ పెట్టితే, అనవసరమైన దుబారా ఖర్చు అగుటయే తప్ప వేరుకాదు. వేరే ఒక విషయాన్ని కూడ చెప్పారు, ఒక రకంగా సర్దుబాటు చేయుటకు నెల్లూరును కూడ తిరుపతిలో చేర్చవలెనన్నారు. ఒక area లో ఒక co-operative

society పనిచేస్తున్నప్పుడు, మరొక society ని ప్రారంభించాలంటే వున్న సొసైటీకి తెలిపి వారి అనుమతిని పొందే ఏర్పాటు చేయవలెను. అలాంటిది ఏమి కూడ మన విశ్వవిద్యాలయం నిర్మాణములో కనిపించ డములేదు. ఆంధ్రయూనివర్సిటీలో రాయలసీమకు ప్రాతినిధ్యము యివ్వ బడింది. వారి కాలేజీలు మాత్రం మద్రాస్‌కు అనుబంధం చేయబడ్డాయి. ఆంధ్రయూనివర్సిటీకి తెలియ చెప్పకుండగనే రాయలసీమకు క్రొత్తగ యూనివర్సిటీ పెట్టుటకు ఒక కమిటీని వేశారు. బిల్లు ముసాయిదా అంతా తయారు అయిన తరువాత, నెల్లూరును విడగొట్ట బోతూ ఉన్నామని చెప్పారు. అంతవరకు నెల్లూరును ఆంధ్రయూనివర్సిటీనుంచి విడగొట్టే విషయం ఆంధ్రయూనివర్సిటీకి చెప్పనేలేదు. నిన్న వరదాచారిగారు ఒక సూచనచేశారు' నెల్లూరుకు మాత్రమే కాక గుంటూరును కూడ రాయలసీమ యూనివర్సిటితో కలిపితే బాగా ఉంటుంది అన్నారు. వరదాచారిగారు కాస్తముందుకు వెళ్ళి ఆంధ్రలోని కాలేజీలను తిరుపతి యూనివర్సిటీకి affiliate చేసి వాల్తేరును Residential గా మార్చితే బాగుంటుందని చెప్పితే యింకా బాగా వుండేది. తిరుపతి Affiliating గా వుండాలా, Residential గా వుండాలా అనే సమస్యను పరిష్కారం చేయవలసివుంది. అది కూడ కొంతవరకు ఆలోచించవలసిన విషయం. రాయలసీమ, సర్కారు అనే విభేదాలు కొంత ధ్వనించడం తప్పడంలేదు. శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటి బిల్లు వచ్చిన తరువాత వాల్తేరు చౌదరీ యూనివర్సిటీ అనిన్ని తిరుపతి రెడ్డి యూనివర్సిటీ అనిన్నీ ప్రతిచోట అను కొంటున్నారు. ఈ రెంటిమధ్య అభిప్రాయ భేధాలు రాకుండా చూడవలసిన అగత్యం ఉంది. క్రిష్ణమూర్తిరావుగారు చెప్పారు తిరుపతిని అంతకూడ ఆ రాజగోపాలాచారి కుతంత్రంతో సెంట్రల్ గవర్నమెంటు తీసుకొనుటకు ప్రయత్నం జరుగుచున్నదన్నారు. దీనికి ఆధారం ఏమి ఉందో తెలియదు. అందులో యదార్థం ఉన్నదని గుర్తించలేము. ఆంధ్రప్రభుత్వం తిరుపతిని వదలుకొనుటకు సిద్ధంగ వుండదనేది అందరూ అంగీకరించే విషయం. దానిలో వివాదము లేదు. రెండు విషయాలు చెప్పి ముగించుతాను. శాశ్వతంగా యూనివర్సిటీ కాలేజీలలో ఉండే Professors Academic Council లో సభ్యులుగా వున్నప్పుడు, సెనేటులో ఎందుకు వుండవలసిన అవసరం వుందో తెలియకుండా వుంది. Academic Council విద్యావిధానమంతా రూపొందించుచున్నప్పుడు సెనేటులో affiliating

Colleges కు సంబంధించిన Principals సభ్యులుగా ఎందుకుఉండవలెనో అర్థం అగుటలేదు. ఆరుమాసములలో నే Constitution ప్రకారం సెనేటు నిర్మాణం చేయవలెనని అంటూ ఉన్నారు. డబ్బు తీసికొని ఉద్యోగం చేస్తున్న ఉద్యోగులు మాత్రమే వైసు చాన్సలరు నియామకము చేయుటకు అవకాశం వుంది. అందువల్ల సెనేటులో మాత్రము వాండ్లందరికి ప్రాతినిధ్యము ఉండవలసిన అవసరంలేదు. Vice చాన్సలరు నియామకము 5 సంవత్సరములు గాక దానిని తగ్గించుటకు ఆలోచించ వలెను. సిబ్బంది విషయంలో కూడ Director of Public Instruction ను కలుపుకొని ఒక చిన్న కమిటీని నియమించవలెను. సెలెక్టుకమిటీ సందర్భంలో ఈ యూనివర్శిటీ Residential లేక Affiliating ముఖ్యమైన విషయాలలో శ్రద్ధతీసుకొనవలెనని మనవి చేస్తున్నాను.

Sri K. V. VEMAREDDI — అధ్యక్షా, విద్యాశాఖా మంత్రిగారు ఈ బిల్లును ప్రవేశపెట్టినందుకు కొన్ని విషయాలు చెప్ప దలచుకొన్నాను. ముఖ్యంగా అనేకమంది ఉపన్యసించారు. ఈ బిల్లు ఎందుకుగాను ప్రవేశపెట్టబడింది ఆ బిల్లులోనే తెలుపబడింది. ఇంకను నిన్నటిదినము మాట్లాడుతూ ఇది ఏదో యూనివర్శిటీ స్థాపన విషయం లో ఏదో ఒక సంకుచితభావంతో ఈ యూనివర్శిటీ ఏర్పాటుచేస్తున్నారు. దేశ ఐక్యతను విచ్ఛిన్నముచేయుటకు ప్రవేశపెట్టుతూ వున్నారు అని శ్రీ వావిలాల గోపాలక్రిష్ణయ్యగారు శ్రీ రాజగోపాలరావుగారు ఉపన్యసించారు. ఇది చాలా పొరబాటు అని చెప్పుతున్నాను. ఇది రాయలసీమ చిరకాల కోరిక. A. P. Patro ప్రధాన మంత్రిగ ఉన్న ప్పుడు ఈ సమస్య బయలుదేరింది. ఆనాటినుంచి ఆందోళన చేస్తూ వున్నాము. ఈనాడు ఎన్ని ఆర్థికచిక్కులు వున్నప్పటికీ ప్రతిపక్ష సహాయంతో యీ బిల్లును ప్రవేశపెట్టారు. వాండ్లను నేను పూర్తిగ అభినందించుచున్నాను. వాండ్లకు విశ్వవిద్యాలయస్థాపన విషయంలో భేదాభిప్రాయాలు లేవు. వాదము ఒకటే. కొందరు Residential University అని మరికొందరు Affiliating University అని. ఏదిఅయినాగాని ముఖ్యంగా రాయలసీమ కోరేది Affiliating University. ఎందుకంటే చాల దినములుగ మీకు తెలుసు. రాయలసీమకు Waltair 5 వందల మైళ్ళ దూరంలో వుంది. మధ్యతరగతి విద్యార్థులు, బీదవిద్యార్థులు Waltair కు వెళ్ళి చదువుటకు సాధ్యంకాదు.

సర్కారు ఆంధ్రులనుండి విడిపోవలెననే ఉద్దేశ్యంగాదు. ముఖ్యంగా దీని విషయంలో మనం సంకుచిత దృష్టితో చూస్తే అలానే కనిపిస్తుంది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత, మనలో అనుమానాలు ఎక్కువైనవి. ఇందువల్ల భాషారాష్ట్రాల ప్రతిఫలము లేకుండా పోతున్నది. రాయలసీమ ఆంధ్రదేశములో ఒకభాగము కాబట్టే మరొక విశ్వవిద్యాలయం ఏర్పాటుచేస్తున్నారు. ఇది ఏదో సంకుచితభావాలతో కులతత్వమును లేవదీయటానికి, దేశం విచ్ఛిన్నముచేయుటాకి యీ బిల్లును ప్రవేశపెట్టుతున్నారని అనటం చాలా శోచనీయమైన విషయం. ఒక సంస్కృతి అభివృద్ధికావాలంటే (సంస్కృతి అంటే విశాలమైనదని గూడ అర్థము వున్నది) ఒక ప్రదేశములో రెండుమూడు చోట్ల యీ సంస్కృతిని అభివృద్ధిచేయటానికి అవకాశం వుంది. తిరుపతిలో అఫీలియేటింగ్ యూనివర్శిటీని ఏర్పాటుచేయటానికి ప్రభుత్వం సంకల్పించింది. తిరుపతిలో అందుకు ఏర్పాటు చేస్తున్నారు అనంతపురం కాలేజీని రెండవ కేంద్రముగా ఆంధ్రయూనివర్సిటీ అధ్వర్యంక్రింద ఎందుకు ఏర్పాటు చేయకూడదని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు అన్నారు. మంచిదే తిరుపతికంటే అనంతపురం చాలా బాగుంటుంది. రాయలసీమలో డబ్బు యిచ్చేవారు లేరు, అనంతపురం జిల్లా ఎప్పుడూ కరువు కాటకాలకు గురిఅవుతున్న దేశం. తిరుపతి దేవస్థానంవారు డబ్బు యిస్తామన్నారు. 20 లక్షల రూపాయలు భవనాల రూపంగాను ప్రతి సంవత్సరం కొంత డబ్బు రూపంగాను యిస్తామని చెప్పినందువల్ల అక్కడ యూనివర్సిటీని ఏర్పాటుచేస్తున్నారు పుణ్యక్షేత్రమనిగాదు, వెంకటేశ్వరపాదాలవద్ద యూనివర్సిటీని ఏర్పాటుచేస్తామనిగాదు. ఐతే యీ అఫీలియేటింగ్ యూనివర్సిటీగా వుండాలా రెసిడెన్షియల్ యూనివర్సిటీగా వుండాలా అనే దాంట్లో అభిప్రాయభేదాలు వస్తున్నవి.

యీ రెండింటికీ ఖర్చు ఒకటే అవుతుంది. రెసిడెన్షియల్ యూనివర్సిటీ అయితే, కాలేజిఫీజు, పరీక్షలఫీజులు తప్ప ఇతర ఆదాయము వుండదు. గ్రాంటులమీద ఆధారపడి వుండాలి. కేంద్రప్రభుత్వం మీద ఆధారపడి వుండాలి. ఇప్పుడు తిరుపతి టెంపుల్‌వారిపై ఆధారపడినా మనకు డబ్బు చాలదు. 140 లక్షలు ఖర్చులు అవుతాయి. ఇందులో 20 లక్షలు తిరుపతి దేవస్థానంవారు యిచ్చినప్పటికీ మిగతా మొత్తం ప్రభుత్వం భరించాలి. ఢిల్లీ ప్రభుత్వంగూడ కొన్ని గ్రాంటులు

యివ్వాలి. మన ప్రభుత్వమునకు వున్న ఆర్థిక చిక్కులను ముందు చూచుకోవాలని శ్రీ C. V. K. రావుగారు అన్నారు. యీ దినం ప్రభుత్వమునకు చిక్కులు వున్నమాట వాస్తవమే. దానికంటే ప్రభుత్వం ముందు విద్యావ్యాప్తికి కృషిచేయ్యాలి. ఇన్ని ఆర్థిక చిక్కులు వున్నప్పటికీ, ప్రభుత్వం నూతన విద్యావ్యాప్తికొరకు మీ అందరి సహకారముతో యీ విశ్వవిద్యాలయమును ఏర్పాటు చేయుటకు పూనుకొనినందుకు ప్రభుత్వమును అభినందించుచున్నాను. ఈ బిల్లు విషయములో వివరములు యిక్కడ చెప్పనవసరములేదు. కారణం ఇది సెలక్టుకమిటీకి రిఫర్ చేయబడుతున్నది గాబట్టి అక్కడ దీనిని బాగా పరిశీలిస్తారు. శ్రీ ప్రగడ కోటయ్యగారు అన్నట్టు ఆంధ్ర యూనివర్సిటీకి ఇది నకలు గాకుండా యిందులో వేరే కోర్సులుగూడా పెట్టే సూచనలు చేయవచ్చును. శ్రీ ప్రగడ కోటయ్యగారు చెప్పినట్లు వైస్ ఛాన్సలర్ సర్వీస్ కాలపరిమితినిగూడ సెలక్టుకమిటీవారు ఆలోచించాలని కోరుతున్నాను. ఒక నూతన పంథాగా ఏర్పాటుచేయాలి. ఆంధ్రయూనివర్సిటీ మాదిరిగానే ఏర్పాటుచేస్తే లాభంలేదు. వైస్ ఛాన్సలర్‌ను నియమించే విధానములో కొంతమార్పు వుండాలి. ఢిల్లీ విశ్వవిద్యాలయంవారు వేరే విధానంగా ఎన్నుకుంటారు. అక్కడ ఒక కమిటీ వుంటుంది. వారు ఒకరిని ఏర్పాటుచేస్తారు. వారిని భారత రిపబ్లిక్ అధ్యక్షులు ఆమోదిస్తారు. మదరాసురాష్ట్రములో గూడ ఒక penal ఏర్పాటు చేసి వారిద్వారా వైస్‌ఛాన్సలర్‌ను ఎన్నుకుంటారు.

మన ఆంధ్ర రాజకీయాలు, దిన దినము దిగజారి పోతున్నాయి. మంచివారు పైకి రావటానికి వీలులేకుండా పోతున్నది. ప్రతిదానికి పోటీలు ఏర్పడుతున్నవి. సెలక్టుకమిటీ దీనినిగురించి బాగా పరిశీలించి తిరుపతి యూనివర్సిటీని అఫీలియేటింగ్ యూనివర్సిటీగా చేస్తే బాగుంటుందని చెప్పుతున్నాను. శ్రీ విజయనగరం రాజాగారు తాత్కాలికంగా రెసిడెన్షియల్ యూనివర్సిటీగా చేయమని చెప్పారు, అందువల్ల రాయలసీమ కాలేజీలు ఎక్కడవుండాలనే ప్రశ్న వస్తుంది. అది చాలా దూరంగా వుంది. విద్యార్థులకు చాలా కష్టముగా వుంటుంది. రెసిడెన్షియల్ యూనివర్సిటీగా ఏర్పాటుచేసే పక్షములో దానిని అఫీలియేటింగ్ యూనివర్సిటీగా ఏర్పాటుచేసేవరకు మదరాసులో వుండేటట్లు ఏర్పాటు చేస్తే చాలామంచిది.

Sri C. PULLA REDDI :— అధ్యక్షా, ఈ బిల్లును సమర్థిస్తూ చిత్తూరుజిల్లా నియోజక వర్గమునుంచి వచ్చిన, శ్రీ కృష్ణమూర్తి రావుగారు తాను ఏదో ఒక యూనివర్శిటీని రాయలసీమకు తీసుకొని వస్తుంటే దానికి కమ్యూనిష్టుపార్టీ అడ్డంవస్తున్నదని, ఒక విసురు విసిరారు. ఒక్క విషయం చెబుతున్నాను. ఈ నాడు తిరుపతిలో ఒక రెసిడెన్షియల్ యూనివర్శిటీని పెట్టడానికి కమ్యూనిష్టుపార్టీ ఏమీ అడ్డు పెట్టలేదు. కావలెననే కమ్యూనిష్టుపార్టీ మొదటనుంచీ కోరుతున్న సంగతి ప్రతి పక్షము వారికి తెలుసును. మన మంతా మద్రాసురాష్ట్రములో వున్నరోజులలో శ్రీ కృష్ణమూర్తిరావుగారు వారితోపాటు చాలా మంది రాజగోపాలాచారి తరపున చేతులు ఎత్తుతున్న రోజులలో తిరుపతి విశ్వవిద్యాలయం గురించి రాయలసీమ వారికి మద్రాసు వారు అన్యాయం చేస్తున్న రోజులలో మేము చాలాసార్లు తిరుపతి యూనివర్సిటీని గురించి ప్రశ్నలు వేస్తూవచ్చామన్న సంగతి మీకు జ్ఞాపకము చేస్తున్నాను. రాజగోపాలాచారిగారు "No" అని చెప్పుతున్నప్పుడు కాంగ్రెస్‌పార్టీ వారితో ఏకీభవించింది. కమ్యూనిష్టుపార్టీ కాదని చెప్పుతున్నాను.

ఆంధ్ర యూనివర్సిటీ విషయాలుగానీ శిండికేట్ విషయాలుగాని వివరంగా యిక్కడ చర్చించ దలచుకోలేదు. ఇప్పుడు జరగవలసినది ఏమిటి? ప్రతిపక్షములో ఎక్కువమంది తిరుపతి విశ్వవిద్యాలయమును రెసిడెన్షియల్ యూనివర్శిటీగా చేయాలనీ ప్రతిపక్షములోని కాంగ్రెస్ పక్షనాయకులు అఫీలియేటింగ్ యూనివర్సిటీగా చేయాలని అంటున్నారు. తిరుపతి యూనివర్శిటీ అఫిలియేటింగ్ యూనివర్శిటీగా, స్థాపించుటలో రాయలసీమకు అదనపు సౌకర్యాలు ఏమి వస్తాయో, తెలుపవలసినదిగా కోరుతున్నాను. రెసిడెన్షియల్ యూనివర్శిటీని పెట్టటంవల్ల పరిష్కారం అవుతవని చెప్పుతున్నాను. తిరుపతిలో విశ్వవిద్యాలయం పెట్టడానికి అందరము ఒప్పుకున్నాము. రెసిడెన్షియల్ యూనివర్సిటీగా చేయుటంవల్ల మీకు ఏ కాలేజీలు స్థాపించటానికి అడ్డువస్తున్నదని అడుగుతున్నాను.

ఒక Engineering College స్థాపించ డానికి గాని, ఒక Medical College స్థాపించ డానికి గాని, లేక ఒక Research Institution స్థాపించడానికి గాని Affiliating University

అయితేనే చేయగలుగుతాము కాని Residential University చేసినంతమాత్రాన ఒకResearch Institution గాని, లేకఒక Techinical Institution గాని, లేక ఒక Arts college గాని స్థాపించుటకు వీలులేదని చెప్పగలరా? వీటిని తిరుపతిలో స్థాపించడానికి Residential University అడ్డువస్తుందా అని అడుగుచున్నాను. రాయలసీమలో మనకు కావలసి నటువంటి Educational Institutions స్థాపించడానికి గాను Residential University అయినా స్థాపించుకోవచ్చును. అంతే కాని క్రిష్ణమూర్తిరావుగారు చేస్తున్నటువంటి ఈ కుట్రప్రయత్నం పనికిరాదు. ఏదో రాయలసీమకు మేము, కాంగ్రెసు నాయకులు ప్రత్యేకంగా కోస్తా బంగారు తెస్తామనుకుంటే ఈ పుల్లారెడ్డి, నాగిరెడ్డి అడ్డు తగుల్తున్నారనే వాదన చేయవద్దుఅని చెప్పుచున్నాను. మేము ఎప్పుడైన, రాయలసీమలో ఒక Technical Institution పెడతామంటే గాని ఒక College స్థాపించామంటే గాని అడ్డుపడుతున్నామా? Residential University ఉంటే ఇవి స్థాపించ డానికి వీలుఉండదా! దీనికి సరియైన సమాధానము చెపుతే ఆ సంకుచిత మనస్తత్వ మేదో స్పష్టముగా బయట పడుతుంది. పోతే దీనికి ప్రభుత్వము నుంచి ఒకే ఒక సమాధానము వస్తుంది. అది ఈ కాలేజీలలో నుంచి వచ్చే డబ్బు ఎక్కువగా సంపాదించుకో వచ్చునని అంటారు దానికి కూడా అప్పారావుగారు సమాధానము ఇవ్వనే ఇచ్చారు. ఆంధ్ర యూనివర్సిటీకి వచ్చే ఈ Examination Fees లో అంతో ఇంతో తిరుపతి యూనివర్సిటీకి ఇవ్వవచ్చు. లేక రాయలసీమకు ఇది బ్రహ్మాండమైన భారము, ఖర్చుఅని ప్రభుత్వము తలచేటట్లైతే ప్రత్యేకంగా దానికి కొంత grant ఇవ్వవచ్చును. దానికి ఏదిగాని అడ్డురాదు. డబ్బుకోసర మనే Affiliating University గా ఏర్పరచ నవసరములేదు. రెండవ కారణం ఏమిటంటే మాకు దూరమని అంటున్నారు. ఏ నాయకులైతే శ్రీబాగు ఒడంబడిక ప్రకారం కర్నూలులో రాజధాని పెట్టవలెనని శ్రీకాకుళం జిల్లా ప్రజలకు దీనివల్ల ఏమి ఇబ్బంది ఉండదని సామాన్య రైతులు ప్రజలు రాజధానికి రావలసిన అవసరముండదని M. L. A లు మాత్రమే రావలసి యుంటుందని 5 వందల మైళ్ళ దూరములో నున్న శ్రీకాకుళం వారికి ఇబ్బంది లేదని చెప్పిన నాయకులకు ఈనాడు దీనికి మాత్రము దూరము ఎందుకని వస్తున్నదో అర్థం కావడంలేదు.

సామాన్య రైతులు ప్రజలు రాజధానికి రావలసిన అగత్యంగాని మంత్రులను చూడవలసిన అవసరముగాని అంతగా ఉండదన్నారు. అయితే ఈ సందర్భములో నేను ఒకటి అడుగుచున్నాను. ఈ విషయము విద్యార్థులకు దూరమై పోతుందని అంటున్నారంటే ఏ సమస్యలపైన ప్రతి రోజు, ప్రతి సంవత్సరము, ప్రతి విద్యార్థి University centreకు రావలసివస్తుందని అడుగుచున్నాను. ఈ నాడు బెజవాడ students ఉన్నారు. నెల్లూరు students ఉన్నారు. వీరు ఏ సమస్య పైన ప్రతి సారి వాల్టేరు దగ్గరకు వస్తున్నారు. ఏ కష్టసుఖాలను చెప్పుకునేందుకు ఇక్కడికి రావలసి వస్తున్నదో చెప్ప మంటున్నాను.

తిరుపతి Affiliating University చేసినా, కర్నూలునుంచి తిరుపతికి రావలసినపనిలేదా? ఒక capital ను కర్నూలుకు తీసుకువచ్చినప్పుడు శ్రీకాకుళం రైతులకు ప్రజలకు కర్నూలుకు రావలసిన అవసరం ఎంతఉంటుందో, University Centre కు విద్యార్థులు రావడానికి అవసరం అంతకంటె చాలా తక్కువగా ఉంటుంది. మనమందరము Univerisity లో చదువుకొన్నవాళ్లము కదా? మనమంతా University Centre కు diplomas తీసుకోవడానికి గాని, మన కష్టసుఖాలు Vice-Chancellor తో చెప్పుకోడానికి గాని, ఎన్నిమార్లు రావలసివచ్చిందో ఒకసారి జ్ఞాపకం చేసుకోండి, స్పష్టమౌతుందని అంటున్నాను. పోతే వచ్చేటటువంటి సమస్యఏమిటంటే, గత ఎన్నికల నుంచి అనగా రెండుసంవత్సరాలనుంచి కాంగ్రెసుపార్టీ ఏ సమస్య వచ్చినా ఒకవిధమైన పట్టుబట్టి ప్రాంతాలకు ప్రాంతాలకు ముడిపెట్టి విభజించాలని ప్రయత్నం చేస్తున్నారు. తమ ఈ విధానాన్ని ప్రతి విషయములోను స్పష్టంచేస్తూనే యున్నారు, కాంగ్రెసు నాయకులు కొంతమంది. పోతే క్రిష్ణమూర్తిరావుగారు రాయలసీమకు ఏమిచేద్దామన్నా, ఏమి సహాయము కలుగజేస్తామన్నా, ఈ కమ్యూనిస్టుపార్టీ వారు వారికి కోస్తాజిల్లాలలో పలుకుబడి ఉండడంవల్ల majority ప్రజానీకం అక్కడ ఉండడంవల్లనూ, ఈ రాయలసీమను అణగద్రొక్కడానికి ప్రయత్నంచేస్తున్నారని ఉపన్యాసాలు ఇచ్చారు. వారికి నేనొక ప్రశ్న వేస్తున్నాను. మద్రాసు గవర్నమెంటులో ఉన్నప్పుడు మీరు రాయలసీమకు అక్కడనుంచి మోసుకొనివచ్చింది ఏమిటి? తరువాత ప్రత్యేకంగా మన గవర్నమెంటు వచ్చినతరువాత ఏమేమి సాధించామో

చెప్పితే విషయాలు స్పష్టమవుతాయి. కర్నూలు రాజధాని అయినందున ఆ ప్రాంతము ఎంత అభివృద్ధి చెందిందో చెప్పమని అడుగుచున్నాను. ఆ వివరాలన్నీ చెప్పదలచుకోలేదు. ఒకటి మాత్రము స్పష్టంగా కన్పిస్తున్నది. కాంగ్రెసునాయకులు అధికారంలోకి వచ్చిన తరువాత, మనలో మనకు, ప్రజలలోఒకరికొకరికి పేచీలు పెట్టడానికి ప్రయత్నం చేస్తున్నారు. మన ఆంధ్ర దేశాన్ని మూడు ముక్కలుగ చీల్చివేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఏ మనస్తత్వమైతే విశాఖపట్నంలో హైకోర్టు ఉండాలని కర్నూలులో రాజధాని ఉండాలని, మద్రాసులో అఫీసులు ఉండాలని ప్రయత్నించిందో ఆ మనస్తత్వమే ఈ నాడు మరల ఈ ప్రాంతాలను రాయలసీమ సర్కారు అని విడదీయాలని చూస్తున్నది. ఏ మనస్తత్వమైతే ఆనాడు ఆంధ్రరాష్ట్రమే వద్దు అని నెహ్రూకు టెలిగ్రాములమీద టెలిగ్రాములు పంపించిందో, ఏ మనస్తత్వమైతే, ఆంధ్ర దేశాన్ని మూడు ముక్కలుగా విభజించేందుకు ఆనాడు ప్రయత్నించిందో ఏ మనస్తత్వమైతే నందికొండ సిద్ధేశ్వరములకు పోటీపెట్టగా, తుదకు కేంద్ర ప్రభుత్వము రెండిటికి సున్నజుట్టిందో, ఆ మనస్తత్వమే ఈ నాడు ఏకారణం లేక పోయినా, ఏ చిన్న పుల్లంత ఉపయోగం లేకపోయినా, ప్రత్యేకంగా రాయలసీమకు Affiliating University కావాలని తమ ప్రాంతాలలో తాత్కాలికంగా కొంత అధికారాన్ని పలుకుబడిని సంపాదించుకోడానికి దేశాన్ని ఈ విధంగా చీల్చివేయ ప్రయత్నిస్తున్నది.

ఆంధ్రదేశముయొక్క విభజన అయినప్పటినుంచికూడ ఆ మనస్తత్వము ఇందుకొరకు ప్రయత్నిస్తున్నది. ఇప్పుడు Climax stage వచ్చింది ఆ మనస్తత్వము అని నేను చెప్పదలచుకొన్నాను. ప్రతి దానికి కమ్యూనిస్టులు అడ్డుతగుల్తున్నారని అంటున్నారు. ఈ విషయములో తమఅభిప్రాయాన్ని తెలిపిన M. వెంకటరంగయ్య, కమ్యూనిస్టా అప్పారావు కమ్యూనిస్టా అని అడుగుచున్నాను. ప్రతిరోజు కాంగ్రెసుపార్టీ సమావేశాలు జరుపుకొంటున్నారు. మీలోకూడ ఈ విధానం ఆంధ్ర దేశ ఐక్యతకు క్షేమానికి భంగకరమని, ప్రజాభిప్రాయానికి విరుద్ధమని, దీనికి వ్యతిరేక అభిప్రాయము కలవారున్నారు. అందుకే రోజూ సమావేశాలు వేసుకొంటున్నారు. అసలు సమస్య ఏమిటంటే మీరు

(Sri C. Pulla Reddi) [14th May 1954

Affiliating University చేయడం ద్వారా అదనంగావచ్చే లాభము ఏదో చెప్పండి. అలాంటిదేమి లేనప్పుడు, ప్రజలను, దేశాన్ని చీల్చడానికి ఎందుకు ప్రయత్నిస్తున్నారని అడుగుతున్నాను. ఇప్పటికే మీలోమీరు ఎంతో తగవులాడుకొంటున్నారు. ఉద్యోగాల విషయంలో గాని, పదవుల విషయంలోగాని, degree ల విషయంలోగాని, అన్నిటిలోను తగవులాడు కొంటున్నారు. Planning శాఖలో ఒకరికి కావలసిన ఉద్యోగులను ఇంకొకరు నిరాకరించడంతో మనస్పర్థలు ఏర్పడ్డాయి. D. M. S. నావాడుండాలంటే, నావాడుండా లని ఈ విధంగా తగవులాడు కొనడం జరుగుతుంది. ప్రతిదానికి అభిప్రాయ భేదాలతో, కొట్లాడుకోవడం జరుగుతూంది ఆ విధంగానే ఈ నాడు ఒక యూనివర్శిటీ బిల్లు సృష్టించి ప్రజలను విడదీసి దేశాన్ని ముక్కలుముక్కలుగా చీల్చివేయాలనిచూస్తున్నారంటే చాలా విచారకరంగా ఉన్నది. కనుక ఈ బిల్లును Select Committee లో చాలా జాగ్రత్తగా పరిశీలించవలెనని విజ్ఞప్తిచేస్తూ విరమిస్తున్నాను.

CHAIRMAN (Sri G. Nagabhushanam): The House stands adjourned till 9 A. M. tomorrow, the 15th May 1954.

The House then adjourned.

*APPENDIX*

(Vide answer to Starred Question No 508 put by Sri T Lakshminarayana Reddi, at the Meeting of the Assembly held on 14 5-'54, Vide page 360 supra)

## LIST OF CONTRACTORS WITH NO. OF WORKS PAID AND THE TOTAL PAYMENTS MADE TO THEM

| S No | Name of Contractor and Address | No o works done | Amount paid |
|---|---|---|---|
| 1. | Abdul Sattar, Khadakpara, Kurnool | 1 | Rs 1,100 |
| 2. | Abdul Salam, Contractor, P W D, Kurnool | 6 | 67,900 |
| 3 | Ahmad Basha, „ | 1 | 30,000 |
| 4. | K G Abdul Kareem, „ | 1 | 20,000 |
| 5 | P S Madanagopal Naidu, Contractor, Highways | 1 | 30,000 |
| 6. | G Shalimiah, Contractor, P W D, Kurnool | 2 | 40,000 |
| 7. | Alimiah, „ | 3 | 24,000 |
| 8. | T Ch Seetharamiah, „ | 2 | 2,03,000 |
| 9 | C Eswara Reddy, „ | 2 | 55,000 |
| 10 | P Ananthiah, Contiactoi, P W D, and Highways, Kurnool | 3 | 1,20,500 |
| 11 | E B Narasimhulu, Contiactor, P W. D, Kurnool | 3 | 26,100 |
| 12. | M Ramachandramurthy, „ | 3 | 15,500 |
| 13 | Syed Idrus, Contractor, P.W. D, Dhone | 2 | 2,200 |
| 14 | B. Munappa, Contractor, P. W. D, Police etc, Peta, Kurnool | 6 | 26,700 |
| 15 | Syed Honnur Sahib „ | 1 | 7,000 |
| 16. | Hussain Saheb, „ | 1 | 80 |
| 17. | Ebrahim Saheb, , | 2 | 4,200 |
| 18. | K Venkata Reddy, Contractor, P W D Koilakuntla. | 9 | 44,700 |
| 19. | Swamy and Company, Contractors and Engineers, Madras. | 1 | 8,000 |
| 20. | Lakshmi Narayana, Contractor, Kurnool. | 2 | 10,000 |
| 21. | Gannon Dankerly & Co, Contractors & Engineers, Madras | 2 | 55,900 |
| 22. | K. V. Seshagiri Rao, Contractor, P W. D., Kurnool | 1 | 12,000 |
| 23. | Anthony, Not known | 2 | 1,700 |
| 24. | C Srinivasan, Engineers and Contractors | 1 | 500 |
| 25. | Busa Gowd, Contractor, P. W. D. Kurnool | 5 | 16,000 |

| S No | Name of Contractor and Address | No of works done | Amount paid |
|---|---|---|---|
| 26. | Veera Reddy, Contractor, P W D, Proddatur Cuddapah District | 1 | Rs 2,000 |
| 27. | M Sreeramulu, Contractor, P W. D, Kurnool | 1 | 6,000 |
| 28. | M. Narasimhamurthy, Co/Sowrich Bois, Camp, Kurnool | 1 | 350 |
| 29. | G A. Gaus, Contractor, Kurnool | 2 | 800 |
| 30. | E. C. Ebrahim, Contractor, P W. D, Kurnool | 2 | 400 |
| 31. | C. A Hameed, " | 3 | 2,000 |
| 32. | C. A Raheem, " | 7 | 10,700 |
| 33 | C. Abdul Jabbar, " | 3 | 5,800 |
| 34. | Abdul Azeez " | 2 | 5,000 |
| 35. | Mohammed Ali, " | 2 | 700 |
| 36. | G Ramsubba Reddy, Contractor, P W D Koilkuntla | 3 | 15,500 |
| 37. | M Kondayya, Contractor, P. W. D, Opposite to Peoples Park, Kurnool | 12 | 23,500 |
| 38. | G Narayana Reddy | 1 | 3,500 |
| 39. | K. P. V Raghaviah, Contractor, P W D Kurnool | 2 | 6,900 |
| 40 | K. C Eswara Reddy, Contractor, P W. D., Proddatur | 4 | 16,500 |
| 41. | R C Narayana | 1 | 3,000 |
| 42. | G. A Rasheed, Contractor, P.W.D, Kurnool | 1 | 500 |
| 43 | E B Krishna Gowd, " | 1 | 250 |
| 44 | B. Ismail, Contractor, Atmakur, Kurnool Dt. | 5 | 5,900 |
| 45. | Unnur Sahib, Contractor, P W D. Kurnool | 1 | 2,000 |
| 46. | Abdul Gaffoor, Contractor, P W D, Masum Basha Street, Knrnool | 1 | 6,000 |
| 47. | C. Mohammad Ibrahim, Contractor, P. W. D Kurnool Bazaar, Kurnool | 1 | 15,000 |
| 48. | N. Eswara Reddy, Contractor, P. W. D., Koilkuntla | 1 | 15,000 |
| 49. | Md Yousuff, Contractor and Carpenter, Khadakpura, Kurnool | 1 | 200 |
| 50. | C. H. Sampengi Rao, Sambasiva Saw Machine, and Timber Depot & Co, Morrispet, Tenali Guntur District. | 1 | 5,000 |